# వరంగల్లు జిల్లా రచయితల వాఙ్మయ జీవిత సూచిక

టి. శ్రీరంగస్వామి




శ్రీలేఖ సాహితి
5-11-114/4 విద్యారణ్యపురి,
వరంగల్లు - 506 009.

ప్రతులు : **1000**

ప్రథమ ముద్రణ అక్టోబరు 1987
( ప్రభవ-దీపావళి )

వెల : **15-00**

ముఖ చిత్రం : బాపు

ప్రతులకు :

**టి. శ్రీరంగస్వామి**
ఇం. నెం. 5-11-114/4
విద్యారణ్యపురి, వరంగల్లు-506 009.

**విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్**
బ్యాంక్ స్ట్రీట్- హైదరాబాదు-500 001.

**విశాలాంధ్ర బుక్ హౌస్**
హైదరాబాదు, విజయవాడ, అనంతపురం, విశాఖపట్నం,
హన్మకొండ, గుంటూరు, తిరుపతి, కాకినాడ

**ఆంధ్ర సారస్వత పరిషత్తు**
బొగ్గులకుంట, హైదరాబాదు-500 001.

బ్లాక్ మేకర్స్ :
శ్రీ లక్ష్మి బ్లాక్ మేకర్స్ హన్మకొండ.

ముద్రణ :
లక్ష్మి ప్రింటింగ్ ప్రెస్
హన్మకొండ - 506 011.

# విజ్ఞాపన

1982 సంవత్సరములో ఒకరోజు కాకతీయ విశ్వవిద్యాలయము నుండి వరంగల్లుకు లోకల్ బస్సులో ప్రయాణం చేస్తుండగా ఆచార్య కోవెల సుప్రసన్నాచార్యులుగారు బస్సులో తటస్థ పడడం, ఆ మాట, ఈ మాటా మాట్లాడుతుండగా, మాటల సందర్భంలో వారు ''వరంగల్లు జిల్లా రచయితల వాఙ్మయ జీవిత సూచిక''ను నొకదానిని తయారు చేస్తే బాగుంటుందని, అందుకు ప్రయత్నం చేయమని నన్ను వారు రేకెత్తించినారు. అప్పటికే వరంగల్లు సాహితీమూర్తులను పరిచయం చేయాలనే ఆలోచనతో వారం, వారం ఒక రచయితను ప్రజామిత్ర వార పత్రికలోను, జనధర్మ వార పత్రికలోనూ వ్రాస్తుండడం మూలాన బాల్య చాపల్యంతో ఇదెంత పని అని భావించి నడుంకట్టి రంగంలోకి దిగాను. అప్పుడుకాని అసలు సంగతి తెలియ లేదు. అదే సంవత్సరములో వంద రచయితల వివరాలు సేకరించాను. **25** మంది నాటక కళాకారులను కూడా పరిచయం చేసాను.

ఈ నా పరిశోధనకు ఉద్యోగపరంగాకూడా ముందుకు వెళ్ళలేక పోయానేమోనని అనుకుంటున్నాను. విశ్వవిద్యాలయాలలోకాని. అధ్యాపకత్వం వైపుకాని ఉండి ఉంటే ఈ పరిశోధనకు కావలసిన పుస్తకాలు ఏమైనా లభ్యపడి ఉండే వను కుంటాను. విషయ సేకరణలో కూడా సౌలభ్యం అయి ఉండేదని భావిస్తున్నాను.

వరంగల్లు సాహిత్య చరిత్రను వెలికితీయడానికి ఆచార్యులు శ్రీ కోవెల సుప్రసన్నాచార్యులుగారు, శ్రీ కోవెల సంపత్కుమారాచార్యులుగారు ఇది వరకే కొంత కృషి చేశారు. ఈ సందర్భంలో తెలంగాణా కవులను గోలకొండ కవులుగా పరిచయం చేసిన శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారి గ్రంథం ''గోలకొండ కవుల సంచిక''ను చూడలేక పోవడం నా నిస్సహా యతకు నిదర్శనంగానే మిగిలి పోతున్నా ప్రయత్నలోపం మాత్రం ఏమి జరుగలేదు. నా కృషికి ప్రతి సందర్భంలో వారి అమూల్య సూచనలను అందించిన ఆత్మీయులు శ్రీ కోవెల సుప్రసన్నాచార్యులుగారికి నా కైమోడ్పులు తప్ప ఏమిచ్చు కోగలను.

నన్ను ప్రప్రథమంగా పత్రికారంగంనకు పరిచయం చేసిన శ్రీ యం. యస్. ఆచార్య సంపాదకులు జనధర్మ వార పత్రిక, శ్రీ దివ్వెల హనుమంతరావు సంపాదకులు ప్రజామిత్ర వార పత్రిక గారిలకు నా నమస్సులు. ఈ సూచిక వెలుగులోనికి రావడానికి కొంత ఆర్థిక సహాయం అందించిన ''తెలుగు విశ్వ విద్యాలయం'' వారికి నా ధన్యవాదాలు. నాపై ఆదరాభిమానంతో కోరిన వెంటనే తమ ''ఆప్తవాక్యాలు'' వ్రాసిచ్చిన శ్రీ కోవెల సుప్రసన్నాచార్యులు గారికి, శ్రీ కాళోజిగారికి, శ్రీ దేవులపల్లి రామానుజరావుగారికి, నా కృతజ్ఞ తాంజలులు. ఈ వాఙ్మయ సూచికను ముద్రిస్తున్నానని తెలుపగానే స్నేహ వాత్సల్యంతో తమ సహకారాన్ని అందించిన మిత్రులకు కృతజ్ఞతలు.

ఈ పుస్తకాన్ని సకాలంలో ముద్రించి ఇచ్చిన లక్ష్మి ప్రింటింగ్ ప్రెస్ హన్మకొండ వారికీ, సిబ్బందికీ, ముద్రణలో సలహాలు అందించిన శ్రీ జి. సమ్మయ్యగారికి నా కృతజ్ఞతలు. నా వ్యాసంగంలో పరోక్షంగా తోడ్పడుతూ, ప్రత్యక్ష సంబంధం ఉన్న విద్యారణ్యపురి పోస్టాఫీసు సిబ్బందికి, ముఖ్యంగా శ్రీ ఎర్రా రాజమౌళికి, నా కృతజ్ఞతలు చెప్పక పోవడం కృత ఘ్నుతే అవుతుంది. ఈ పుస్తకానికి ముఖచిత్రంను అందించిన ప్రఖ్యాత చిత్రకారులు ''బాపు''గారికి కైమోడ్పులు. హన్మకొండవారికి కృతజ్ఞతలు. పరిశోధన నిమిత్తం నాకు సహకరించిన మిత్రులకు పత్రికలవారికి కృతజ్ఞతలు. బ్లాకులను అందంగా మలచి ఇచ్చిన శ్రీ లక్ష్మి బ్లాక్ మేకర్స్ నా వ్యాసంగంలో సహకరించిన నా కుటుంబ సభ్యులందరికీ కృతజ్ఞతలు.

ప్రత్యేకానుబంధంలో వేసిన వ్యాసం, పరిశోధనాంశంనకు సంబంధించినదనే ఉద్దేశంతోనూ ఇందులో చేర్చడం జరిగినది. జూన్ 1987 వరకు అచ్చులో వచ్చిన పుస్తకాలను కూడా ఇందులో పేర్కొన్నాను. ఈ పుస్తకం భావి పరిశోధకులకు Key Note గాను, వరంగల్లు జిల్లా సాహిత్య చరిత్రకు ఉపకరణంగా (Reference Book) ఉపయోగపడుతుందని ఆశిస్తున్నాను.

—టి. శ్రీరంగస్వామి

నా జీవిత పథంలో
నిరంతరం అండగా నిలిచి
చేయూత నిస్తున్న
నా శ్రీమతి శ్రీలక్ష్మికి...

## T. SRI RANGA SWAMY

Born on 16th July 1950 at PARLAPALLY, Kareemnagar Dist.
Settled at H. No. 5-11-114/4, Vidyaranyapuri, Warangal-506 009

Doing: Ph. D. at Kakatiya University. Warangal with topic "VISHWANATH VARI KRISHNA KAVYALU"

Printed Books:

Madhura (Free Verse poetry) 1984
Shikharam (Free verse poetry) 1986
Vipanchi (Essayas) 1986
Warangal Zilla Rachayitala Vangmaya Suchika 1987
......... Free verse poetry Under printing

Edited Books::

Chitanya (Collection of freeverse poetry) 1980
N. B. Rao Kavitha Darpanam (Essayas) 1985
Diviti Collection of freeverse poetry) 1986
Prabhava (Collection of freeverse poetry) 1987
Swaramalika (Collection of freeverse poetry) 1987

Un-Printed Books:

Warangal Natakaranga Charitra
Katragadda Kavitha Samalochanam and Essayas etc.,

Relation With:

Srilekha Sahithi,, Sahithi Samithi, Samskruhti Samakhya. Vishwa sahithi etc.,

# రచయిత వివరములు

జననం : 16-7-1950, పర్లపల్లి, కరీంనగరం జిల్లా

నివాసం : 5-11-114/4, విద్యారణ్యపురి, వరంగల్లు 506 009
కాకతీయ విశ్వవిద్యాలయంలో ''విశ్వనాథవారి కృష్ణకావ్యాలు''
అంశంతో పి. హెచ్. డి. చేస్తున్నాను.

ముద్రితాలు :

మధుర కవితా సంపుటి 1984
శిఖరం కవితా సంపుటి 1986
విపంచి వ్యాస సంపుటి 1986
వరంగల్లు జిల్లా రచయితల వాఙ్మయ జీవిత సూచిక 1987
......... కవితా సంపుటి ముద్రణలో

సంపాదకత్వం వహించినవి :

''చైతన్య'' కవితా సంకలనం 1980
న. బా. రా. కవితా దర్పణం వ్యాస సంపుటి 1985
దివిటి కవితా సంకలనం 1985
ప్రభవ కవితా సంకలనం 1987
స్వరమాలిక కవితా సంకలనం 1987

అముద్రితములు :

వరంగల్లు నాటక రంగ చరిత్ర
శ్రీ కాటగడ్డ కవితా సమాలోచనమ్
సాహిత్య వ్యాసములు

శ్రీలేఖ సాహితి, సాహితీ సమితి, సాంస్కృతీ సమాఖ్య, విశ్వసాహితి, మొదలగు సంస్థలతో సన్నిహిత సంబంధం.

# అనుక్రమణిక

దేవులపల్లి రామానుజరావు
అధ్యక్షుడు
ఆంధ్రసారస్వత పరిషత్తు

హైదరాబాదు
ది. 28-8-1987

# తొలి పలుకు

ఆంధ్రప్రదేశ్‌లో వరంగల్ జిల్లాకు విశిష్టమైన స్థానం. తెలుగు సీమనూ పరిశీలిస్తే అనేక రంగాలలో వరంగల్ జిల్లా గణ్యత సంపాదించుకున్నది. మొట్టమొదటిసారి తెలుగు ప్రజానీకాన్ని ఒక పరిపాలన క్రిందికి తీసుకొని వచ్చిన ఘనత, వరంగల్ రాజధానిగా ఆంధ్ర ప్రాంతాన్ని పరిపాలించిన కాకతీయులకు దక్కుతున్నది. తటాక నిర్మాణం, ప్రజల శ్రేయస్సుకు ఉపకరించే విధంగా శిల్పం, చిత్రలేఖనం, సాహిత్యం, సంగీతం వీని వికాసం ఈ విధంగా వరంగల్‌లో చరిత్ర నిర్మాణం జరిగింది. కావుననే విద్యానాథుడు వరంగల్‌ను ఆంధ్ర నగరమని కీర్తించినాడు.

ఓరుగల్లు అనేక మహాకవులకు జన్మస్థానం. భారత, భాగవత, రామాయణాలు రచించిన కవులకు ఏకశిలానగరంతో సన్నిహిత సంబంధము ఉన్నట్లు తెలుస్తున్నది. ఈ కవుల చరిత్రను సమగ్రంగా క్రోడీకరించవలసిన అవసరాన్ని గుర్తించిన విజ్ఞులు శ్రీ టి. శ్రీరంగస్వామిగారు.

శ్రీ టి. శ్రీరంగస్వామిగారు విద్యాధికులైన యువకులు, ఉత్సాహశీలురు, దీక్ష కలిగిన కార్యదక్షులు. కవులు, రచయితలు. ప్రత్యేకంగా వరంగల్ వాస్తవ్యులు- వరంగల్ జిల్లా రచయితల వాఙ్మయ జీవిత సూచికను సిద్ధముచేసి సకలాంధ్ర సాహితీ పరులకు పరిచయము చేయవలెననే వీరిపూనిక ప్రశంసనీయమైనది. ఆధునికులనేగాక ప్రాచీనులను కూడ వీరు పరిచయం చేసినారు. చాల శ్రమకోర్చి యిటువంటి మంచి ప్రయత్నం గావించి వరంగల్

జిల్లా సాహిత్య చరిత్రకేకాక తెలుగు సాహిత్య చరిత్రకుకూడ ఉపకరించే విలువగల సాహిత్య సామగ్రిని సేకరించి ప్రకటించిన శ్రీ టి. శ్రీరంగ స్వామిగారి కృషి సర్వవిధాల హర్షించదగినది. ఎంత శ్రమ చేసినప్పటి కిని యిటువంటి కృషి సమగ్రం కాజాలదు. అయితే సమగ్రతను సాధించ డానికి భవిష్యత్తులో జరిగే పరిశోధన వ్యాసంగానికి శ్రీ టి. శ్రీరంగస్వామి గారి గ్రంథము అత్యంత ఉపయుక్తము కాగలదని ఆశిస్తున్నాను.

శ్రీ టి. శ్రీరంగస్వామిగారు యికముందు ఇటువంటి కృషి యితోధికముగా గావించి సాహిత్య రంగంలో సముచిత స్థానాన్ని సంపాదించుకోవలెనని నా కోరిక,

భగవంతుడు శ్రీ రంగస్వామి గారికి దీర్ఘాయురారోగ్యైశ్వర్యములు ప్రసా దించ వలెనని నా ప్రార్థన.

—దేవులపల్లి రామానుజరావు

కాళోజి నారాయణరావు
ప్రజాకవి

దివి. 31-8-1987
హన్మకొండ

# మార్గ దర్శనం

మన సమాజం సిద్ధాంత రీత్యా ప్రజాస్వామ్య జీవిత విధానాన్ని ఒప్పుకున్నది. భారత దేశంలోని ప్రజలందరూ, పౌరులూ, స్వతంత్ర భారత దేశపు పౌరులు, ప్రజాస్వామ్య, స్వామ్యవాద, సార్వభౌమ, గణతంత్ర రాజ్యంలో సమాన భాగస్వాములు. ప్రజాస్వామ్య సమాజంలో జీవించే పౌరులకు సంబంధించిన అన్ని రంగాలలో ఈ ప్రజాస్వామ్య దృష్టికలిగి తదనుగుణంగా ఆచరణ, దానికి తగిన ప్రయత్నాలు జరిగినప్పుడే ప్రజాస్వామ్యం మనుగడ కలదు. రచన, రచయితలు సభ్య ప్రపంచంలో అతి ముఖ్యమైన అంగాలు. ప్రజా స్వామ్యం దృష్ట్యా వారందరూ భారత పౌరులే. విశేషించి మేధావి వర్గానికి చెందడం వలన ప్రజాస్వామ్య విధానంలో వారి బాధ్యత మరీ ముఖ్యమైనది.

ప్రజాస్వామ్యంలో అతి ముఖ్యమైన ఎన్నికల విధానము పుణ్యమా అని ఓటర్ల లిస్టులు తయారు అయినవి. వానిలో ఓటరు అర్హత, వయస్సుకు చేరిన ప్రతి పౌరుని పేరు చిరునామా ఉంటుంది. కాని మేధావి వర్గానికి చెంది రచయిత (కథకుడు, కవి, నవలాకారుడు, వ్యాసకర్త కారులు మొదలగువారు)లు అందరికి ఒక పట్టిక రూపములో చేరవలసిన సమానమైన అవకాశంకూడా నోచుకోలేదు. చట్టరీత్యా ప్రతి రచయితపై తన పుస్తకం, రచన పుస్తక రూపంలో అచ్చుకాగానే, జాతీయ గ్రంథాలయాలకు ఒక్కొక్క ప్రతిని పంపించే బాధ్యతకలదు. పౌర ధర్మాలను పాటించిన విషాదకర సంప్రదాయంను అనుసరించి, తక్కిన విషయాల వలననే రచయితలు ఈ బాధ్యతను లెక్క చేయడం లేదు.

ఇట్టి పరిస్థితులలో రచయితలు చాలామంది అనామకులుగా, చిరునామా అయినా నోచుకోని వారైపోతున్నారు. అచ్చైనా పుస్తకాల రచయితలు కూడా సాహిత్య రంగంలో స్థాయి సంపాదించడం. అటుండ, ఒక సామాన్య రచయితగా కూడా తమ పేరును ఏ పట్టికలో చేర్చలేక పోతున్నారు. రచనలు సాగించి వాటిని అచ్చువేసుకోని పరిస్థితులలో, కాలగర్భములో లీనము అయిపోయిన వారు ఎందరో. చిరంజీవి టి. శ్రీరంగస్వామి జిల్లా పరిధిలోనైనా శ్రమించి, పరిశోధన జరిపి పుస్తక రూపములో తమ ఏదైనా రచనను బయటకు పెట్టిన వారినైనా ఒకచోట చేర్చి మన ముందు పెట్టడం, ఆటు ఆ రచయితలను గౌరవించటమే కాదు, సమకాలికులకు మన సాహిత్య జగత్తులో దాని చరిత్ర నిర్మాణంలో పాలుపంచుకున్న పూజ్యులను జ్ఞాపికం చేయించటంవలన చిరంజీవి టి. శ్రీరంగస్వామి అభినందనీయుడు. వారికి మన కృతజ్ఞతలు.

ఈ పట్టిక ననుసరించి ఇంకా చాలా కృషి జరుగవలసి ఉన్నది. అందుకు ఈ "వరంగల్లు జిల్లా రచయితల వాఙ్మయ జీవిత సూచిక"యే శరణ్యం.

—కాళోజి నారాయణరావు

ఆచార్య కోవెల సుప్రసన్నాచార్యులు
కాకతీయ విశ్వవిద్యాలయం

ది. 3-9-1987
వరంగల్లు

# భూమిక

మిత్రులు శ్రీ టి. శ్రీరంగస్వామి రచించిన ''వరంగల్లు జిల్లా రచయితల వాఙ్మయ, జీవిత సూచిక'' ఈ నాటి ప్రధాన అవసరాన్ని తీరుస్తున్నది. తెలుగు దేశంలో సాహిత్య రంగాన్ని అధ్యయనం చేసేటప్పుడు గడచిన వంద, యాభై సంవత్సరాలుగా జరిగిన సాహిత్యచరిత్ర నిర్మాణాన్ని గూర్చి పట్టించుకోవలసి ఉన్నది. వీరేశలింగంగారి నుంచి ఈ నాటివరకు జరుగుతున్న ఈ కృషి ఆ యా పరిమితులలో క్రమక్రమంగా విస్తృతమవుతూ వస్తున్నది. తొలిదశలో స్థూలదృష్టితో ప్రధానాంశాలను, ప్రధాన కవులను, అంచనా వేయడంగా ప్రారంభం అయి. క్రమంగా ప్రక్రియలను గూర్చి ప్రత్యేక అధ్యయనం, ఒక్కొక్క ప్రాంతాన్ని గూర్చిన అధ్యయనం కొనసాగుతూ వచ్చింది.

సామాజిక, రాజకీయ పరిస్థితులను, సాంస్కృతిక రంగాన్ని తీర్చి దిద్దడం స్వాభావికము అయిన విషయం. గడచిన రెండు వందల సంవత్సరాలుగా నిజాంపాలనలో ఉన్న తెలంగాణా ప్రాంతము, మిగిలిన ఆంధ్ర ప్రాంతంతో విభక్తము అయి ఏకాంతంగా అనేక నిర్బంధాలకు లోబడి అంతర్ముఖంగా తన సాహిత్య సాధన కొనసాగిస్తూ వచ్చింది. అంతగా పరిచితంకాని, ప్రత్యేక కృషిగురించి తెలియక సాహిత్య చరిత్రకారులు నిజాం ప్రాంతంలో తెలుగు సాహిత్యం యొక్క ఉనికి, దాదాపు హుళక్కి అని భావించిన పరిస్థితి ఏర్పడింది. దానికి సమాధానంగానే శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు ''గోలకొండ కవుల సంచిక''ను వెలువరించారు.

''గోలకొండ కవుల సంచిక''లో తెలంగాణా ప్రాంతంలో సారస్వత కృషి, కాకతీయుల కాలంనుంచి అవిచ్ఛిన్నంగా కొనసాగుతున్న కృషి వెలికి వచ్చింది. హైదరాబాదు పట్టణాన్ని మినహాయిస్తే మిగిలిన ప్రాంతంలో అధికార భాషయైన ఉర్దూ ప్రభావపు నీడ అంతగా ప్రసరించలేదు. పల్లెలలో, జానపదాలలో తెలుగుసరస్వతి అప్రతిహతంగా తనవిలాసాన్ని కొనసాగిస్తూనే వచ్చింది. అయితే ఇక్కడి సాహిత్య మర్యాదలలో ఆంగ్లేయ విద్యాభ్యాసం వల్ల కలిగిన సంస్కృతీ ప్రాబల్యంవల్ల కలిగిన నూతనోద్యమ ప్రాబల్యం పరివ్యాప్తంగా ప్రస్ఫుటం కాలేదు. పదహారు, పదిహేడు శతాబ్దాల వార సత్వంగా వచ్చిన ఆంధ్రకావ్య సంప్రదాయం, చిత్రబంధ కవితా ప్రాచుర్యం, శుద్ధాంధ్రభాషా ప్రయోగం, దేశీసారస్వత మార్గంలో కీర్తనలు, తత్త్వాలు, తిరునామములు, పండుగ పాటలు మొదలగునవి ప్రచురంగా కానవస్తున్నవి. నిజాం ప్రాంతంలో గద్వాల, వనపర్తి, జటప్రోలు మొదలైన సంస్థానాల్లో మిగిలిన ఆంధ్ర దేశంలోని కవి పండితులతో సంబంధాన్ని నిలబెడుతూ వచ్చాయి. అంతేగాక ఆంగ్ల విద్యావిధానంవల్ల దెబ్బతినని శాస్త్ర అధ్యయ నాన్ని కూడా ప్రోత్సహిస్తూ వచ్చాయి. మహబూబ్‌నగర్ జిల్లాను వదిలితే, మిగిలిన తెలంగాణా ప్రాంతంలో శాస్త్ర, అధ్యయన అధ్యాపనాలకు అవకాశం తగ్గిపోతూవచ్చింది. మత విషయకంగా ఈ ప్రాంతంలో వైష్ణవధర్మ ప్రాచుర్యం, ప్రాబల్యం క్రమంగా గోచరిస్తున్నాయి. వీరశైవం యొక్క తాకిడి ఒకటి, రెండు ప్రాంతాలకు (వేములవాడ, సిద్దిపేట, నిర్మల్) మాత్రమే పరిమితము అయినట్లుగా తోస్తున్నది.

ఈ స్థితిలో తెలంగాణాలోని సారస్వతం ప్రధానంగా శ్రీవైష్ణవులు, గోలకొండ వ్యాపారులు, శాతానులు, భటాజులు మొదలైనవారిని ఆశ్రయించి, ప్రవర్తించింది. శ్రీ పరశురామ పంతుల లింగమూర్తిగారు మహారాష్ట్రము నుండి తెచ్చిన అచల సంప్రదాయం మొదట సీతారామాంజనేయ సంవాదము అయి తరువాత అనేకమైన దేశీ సారస్వత సృష్టికి కారణమై పద్మశాలీలు, మేరు వారు మొదలైనవారిలో వ్యాపించియున్న వీరశైవ సంప్రదాయం దాదాపు

తొలగినను శ్రీ ముదిగొండ, శ్రీపతి పండితారాధ్యుల, కొడిమెల మొదలైన ఆచార్య పురుషుల రాకచేత, ఈ శతాబ్దారంభమునుండి శ్రౌతశైవముగా ప్రవర్తించి సారస్వత సృజనకు హేతువైంది. ఈరకమైన కులముల పేర్ల తోని అంచనావేయడం ఈనాడు సహజము అనిపించక పోవచ్చును కాని, సామాజిక శాస్త్రీయ అధ్యయనంలో, సాంస్కృతిక ప్రవాహాల, సంగమ విభాజనలో అర్థంచేసుకోవడానికి తప్పకుండా ఉపకరిస్తుంది. స్వాతంత్ర్యో ద్యమం తరువాత వెల్లి విరిసిన సారస్వత స్వరూప స్వభావాలు అంచనా వేయడానికి తోడ్పడుతుంది.

ఈ సారస్వతంలో ప్రత్యేకంగా ఆకాలంలోని ఇతర ప్రాంతాల్లోని సారస్వతం కంటె భిన్నంగా కొన్ని విశిష్ట లక్షణాలు గోచరిస్తాయి. వీటిలో ప్రధానము అయినవి భాషాస్వరూపము. ఈ భాషా ప్రయోగ లక్షణం పాల్కురికి సోమనాధుడు, రంగనాధుడు, బమ్మెర పోతనామాత్యుడుల మొదలైన రచనల సంప్రదాయానికి అనుగుణంగా ఉన్నది. అదృష్టవశాత్తు ఈ సారస్వత పరిష్కర్తలు చిన్నయసూరి వ్యాకరణాన్ని అనుసరించి దిద్దే ప్రయత్నం చేయ లేదేమో ! ఆ విధముగా ఈ ప్రాంతంలో అల్పముగా ప్రకటితము. అనల్పముగా తాళపత్రాలలో నిక్షిప్తము అయిన సారస్వతం తెలుగు సాహిత్యం లోని భాషా పరిణామాన్ని అధ్యయనం చేయడంలో తప్పకుండా ఉపకరిస్తుంది.

ఈ పరిశోధనారంగానికి వేదిక సిద్ధంచేయడానికి ఆధార గ్రంధాలు అవసరం ఎంతైనా ఉంది. ఇవి ఈ జిల్లాకు, ఆ జిల్లాకు విడిగా సూచికలుగా రూపొందితే మొత్తం తెలంగాణా ప్రాంతపు అంశాలను అంచనా కట్టుకోవడం సులభ సాధ్యములు. పూర్వం మెదకు మండల సాహిత్య చరిత్ర, కరీంనగరం జిల్లా రచయితల చరిత్రలు సంగ్రహంగా వచ్చాయి. ఇట్లే ఆచార్య బిరుదురాజు రామరాజుగారు 'మరుగుపడిన మాణిక్యాలు'అన్న పేరుతో పదిహేను మంది అవిదిత కవులను గురించి పరిచయం చేస్తూ గ్రంధాన్ని వ్రాసారు. అట్లాగే నల్లగొండ జిల్లా సర్వస్వంలో అక్కడి పూర్వ సాహిత్యం పరిణామం సూచి

తము అయినది. తెలుగు సంస్థాన సాహిత్య పోషణ గ్రంథాలలో గద్వాల ఆది సంస్థానాలలో సారస్వతం గురించి తెలుస్తున్నది.

ప్రస్తుత గ్రంథం వరంగల్లు జిల్లా సారస్వత వికాసాన్ని దిఙ్మాత్రంగా చూపిస్తున్నది. దీనికి పూర్వం శ్రీమాన్ కోవెల సంపత్కుమారాచార్యులు గారు తలపెట్టిన ''మన కవులు, పండితులు, రచయితలు'' అన్న నాలుగు భాగాల గ్రంథం తొలి భాగంతోనే ఆగిపోయింది. ఈ సందర్భంలో వీలైనంతలో సమగ్రమైన సూచికను సిద్ధంచేసిన మిత్రుడు శ్రీ శ్రీరంగస్వామి అభినందనీయుడు. సూచిక చూస్తే చాలా తేలికగా కనిపిస్తుంది. కాని, దానిని సిద్ధం చేయడానికి ఎంతో శ్రమపడవలసి ఉంటుంది. గోలకొండ కవుల సంచికలో శ్రీ దూపాటి వెంకటరమణాచార్యులవారు (శేషాద్రిరమణ కవులు) సిద్ధం చేసిన కవి సూచిక ఈ నాటి పరిశోధకులకు అత్యంత ప్రధానము అయిన ఆకర గ్రంథంగా ఉపయోగపడుతుంది. శ్రీ. శ్రీరంగస్వామి చేసిన కృషి భవిష్యత్తులో ఉత్తమ పరిశోధనలకు ఉపకారకం కాగలదని, ఆయన ముందు ముందు ఈ కృషిని విస్తృత రూపంలో వెలుగులోకి తీసుకు రావాలని ఆకాంక్షిస్తున్నాను.

—ఆచార్య కోవెల సుప్రసన్నాచార్యులు

# 1

## ఉపోద్ఘాతము :—

"వరంగల్లు జిల్లా రచయితల వాఙ్మయ జీవిత సూచిక" ను పరిశీలించే ముందు, వరంగల్లు గత చరిత్రలోని కొన్ని విశేషాలను, ఈ సూచికకు నిర్దేశించుకున్న ముఖ్యోద్దేశం మీ ముందుంచడం అత్యవసరం అని భావిస్తున్నాను.

శాతవాహనుల తర్వాత దాదాపు వేయి సంవత్సరములకు తెలుగుదేశం కాకతీయ చక్రవర్తుల కాలంలో ఓరుగల్లు (ఏకశిలా నగరం) రాజధానిగా ఒకే పరిపాలన కిందికి వచ్చింది. కాకతీయుల చరిత్రలో రాజకీయ చరిత్రకంటె కూడా ఎక్కువ వైభవోపేతమైనది వారి సాంస్కృతిక చరిత్ర. అనేక దేవాలయాలు కట్టించారు, దేవాలయాలకు దానాలు ఏర్పాటుచేసి. సంగీత, నాట్య, శిల్ప, చిత్రలేఖ సాహిత్యాలను నిలయాలను చేశారు. తెలుగు ప్రజానీకమునకు ఒక వైశిష్ట్యమునకు, వ్యక్తిత్వమును సమకూర్చిన మహోదాత్త చరితలు కాకతీయులు. వేయిస్థంభముల దేవాలయములోని శాసన రచయిత "అచితేంద్రవరుడు". రుద్రదేవ మహారాజు కాలమువాడు.

కాకతీయులు శిల్పమును, దేవాలయ నిర్మాణ వాస్తువును పోషించిరి. నాట్యకళకూడ ఆ కాలమున వర్ధిల్లినది. గణపతిదేవుని సేనానియగు జాయపుడు సంగీత నాట్యములను గూర్చి రెండు గ్రంథములను రచించెను. వాటిలో "నృత్తరత్నావళి" మాత్రమే లభించినది. ఆ కాలమున సంస్కృతాంధ్ర భాషలు వర్ధిల్లినవి. ఉభయ భాషలందు శాసనములు రచింపబడినవి. గణపతిదేవుడు తిక్కన మహాకవిని ఆదరించడంకూడ ఇక్కడ గమనించ

దగిన విషయం. మహాకవుల కృషివలన తెలుగు ప్రజలలో సమైక్య భావ నకు ఆకాలముననే స్థిరమైన పునాదులు పడినవి. †

‡ ప్రతాపరుద్రదేవుడు రాజుగానే కాకుండా పండిత కవిపోషకుడు గానే బహుళ ప్రచారములో ఉన్నప్పటికిని ఇతడు మహాకవి యని తెలుస్తు న్నది. ప్రతాపరుద్రదేవుడు ''ఉషా రాగోదయము'' అను నాటికను, ''యయాతి చరితము'' అను నాటకములను సంస్కృతములో రచించెను. ఈయన విద్యానాథాది విద్వత్కవుల నెందరినో పోషించెను.

కాకతీయులు ఓరుగల్లు కేంద్రంగా నెల్లూరు, కంచి, ఆదోని, బీదర్, పొలాస (ప్రస్తుతం కరీంనగరం జిల్లా జగిత్యాల దగ్గర గోదావరినది ఒడ్డున ఉన్న కుగ్రామం), మంతెన, రాజమండ్రి, పిఠాపురం, బంగాళాఖాతంలు సరిహద్దుగా పరిపాలన గావించారు,

క్రమ క్రమంగా విచ్ఛిన్నమవుతు హైదరాబాదు రాజ్యం (నిజాం రాష్ట్రం)లో వరంగల్లు సుబేదారుగా, పోలీసు చర్యతో నిజాం నవాబు ఇండి యన్ యూనియన్‌లో చేరిపోయాడు. తదుపరి ప్రజాతంత్ర రాజ్యం యేర్పడి. 1953 లో ఆంధ్ర రాష్ట్రం ఏర్పడి ఖమ్మం, బూర్గంపాడు, హుజు రాబాదు మొదలగు తాలూకాలు కూడా వరంగల్లు జిల్లాలోనే ఉండేవి.

**1956** నవంబర్ **1** వ తేదీన రాష్ట్ర పునర్ వ్యవస్థీకరణ జరిగి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రావతరణ జరిగి వరంగల్లు, జనగామ, ములుగు, పర్కాల, నర్సంపేట, మహబూబాబాదు తాలూకాలతో వరంగల్లు జిల్లాను ఏర్పాటు చేయడం జరిగింది. ఇదినేటి వరంగల్లు జిల్లా. తిరిగి నైసర్గిక స్వరూపంలో

† కాకతీయులు- శ్రీ పాములపర్తి సదాశివరావు, తెలుగువాణి ప్రపంచ తెలుగు మహా సభల ప్రత్యేక సంచిక 1975

‡ సంస్కృతభాష- తెలుగువారి సేవ- శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, తెలుగువాణి ప్రపంచ తెలుగు మహాసభల ప్రత్యేక సంచిక 1975

ఏ మాత్రం మార్పు లేకుండా ఆయా తాలూకాలను **1983** లో **14** తాలూకాలు గాను, **1986** లో **50** మండలాలుగా విభజించారు ఇలా—

1. చిట్యాల్, 2. మొగుళ్లపల్లి, 3. ఘాపాల్‌పల్లి, 4. పర్కాల్, 5. శాయంపేట, 6. రేగొండ, 7 ములుగు, 8. ములుగు ఘన్‌పూర్, 9. వెంకటాపూర్, 10. గోవిందరావుపేట, 11. ఏటూరు నాగారం, 12. తాడ్వాయి, 13. మంగపేట్, 14. గూడూరు, 15. ఖానాపూర్, 16 కొత్తగూడెం, 17. నర్సంపేట, 18. నల్లబెల్లి, 19. చెన్నారావుపేట, 20. దుగ్గొండి, 21. నెక్కొండ, 22. హన్మకొండ, 23. హసన్‌పర్తి, 24. ఆత్మకూర్, 25. గీసుకొండ, 26. సంగెం, 28. ఘన్‌పూర్. 28. ధర్మసాగర్, 29. జఫర్‌గడ్, 30. చేరియాల, 31. బచ్చన్నపేట, 32. నర్మెట్ట, 33. మద్దూరు, 34. వర్ధన్నపేట, 35. పర్వతగిరి, 36. రాయపర్తి, 37. జనగాం. 38. రఘునాథపల్లి, 39. లింగాల ఘన్‌పూర్, 40. కొడకండ్ల, 41. పాలకుర్తి, 42. దేవరుప్పుల, 43. మరిపెడ, 44. దంతాలపల్లి, 45. తొర్రూర్, 46. మహబూబాబాద్, 47. బలపాల, 48. డోర్నకల్, 49. నెల్లికుదురు. 50. కేసముద్రం.

వరంగల్లు జిల్లా రచయితల వాఙ్మయ జీవిత సూచికను **1956** లో ఏర్పడిన నైసర్గిక స్వరూపమును అనుసరించి క్రోడీకరించడం జరిగినది. ఆ ప్రాంతం యొక్క చారిత్రిక, భౌగోళిక పరిస్థితులు ఏవైనా, ఏకాలమునైనా ప్రభావితం చేస్తుంటాయి. ఆ ప్రభావం స్థానిక చరిత్రలు, సాహిత్య చరిత్రలు ఉన్నంతకాలం ప్రతిబింబిస్తూనే ఉంటవి. ఆ ప్రతిబింబంను రేఖా మాత్రంగానైనా చెప్పడం భావ్యమని, మన పూర్వీకుల నందరిని మారన, పాలకురికిలనుండి సుంకరనేని రాజమౌళి వరకు **3** వ ప్రకరణంలో ఉటంకించడం జరిగినది. అలాగే **19** వ శతాబ్దికి చెంది **20** వ శతాబ్దంలోని కొందరిని ఆచార్యులు శ్రీ కోవెల సంపత్కుమారాచార్యులుగారు పరిచయం చేసినవారిని నాలుగవ ప్రకరణంలో తెలియచేయడం జరిగినది.

ఇక ఈ గ్రంథంనకు ఆయువుపట్టు **5** వ ప్రకరణము, ఇందులో **20** వ శతాబ్దపు రచయితలను వారి జనన సంవత్సరముల ప్రాతిపదికముగా కూర్చాను. **20** వ శతాబ్దపు ప్రథమ రచయిత అల్లూరి రాజేశ్వరరావు (1903)గారు అయితే ఈ గ్రంథంలో చోటు చేసుకున్న చివరి రచయిత కుమారి వాసవి (1972).

వరంగల్లు సాహిత్య చరిత్రకు 1955-56 లోనే † శ్రీ సుప్రసన్నాచార్యులుగారు పూనుకొని ఒక వ్యాసం వ్రాసారు, ఆ తదుపరి 100 మంది రచయితలకు ప్రణాళిక వేసుకొని 30, 33 మంది రచయితలను శ్రీ కోవెల సంపత్కుమారాచార్యులుగారు జనధర్మ వారపత్రికలో పరిచయం చేసారు. అందులోని **25** గురిని "మనకవులు, పండితులు. రచయితలు"గా గ్రంథ రూపంలో వెలువరించారు 1970 లో. ఇవి వరంగల్లు సాహిత్య చరిత్రకు మూలస్థంభాలు అయితే మున్నూట రచయితల వివరాలిస్తూ నా ఈ సూచికను మీ ముందుకు తెస్తున్నాను.

† ఆంధ్రప్రదేశ్ అవతరణ సంచిక (1-11-1956)- ప్రచురణ తెలంగాణా రచయితల సంఘం, వరంగల్లుశాఖ.

ఓరుగంటి పురంబు సౌధములపై
 నొప్పారెడిన్ జూచితే
యీ రెండన్ మణిహేమ కుంభములతో
 ఏ కాంతముల్ సేయుచున్
స్వారాజ్య ప్రమదాఘన స్తనభర
 స్థానంబులంబాసి, కా
శ్మీరక్షోదము, ప్రాణవల్లభ దృఢా
 శ్లేషంబులన్ రాలెనాన్

—వినుకొండ వల్లభరాయుడు
—క్రీడాభిరామము.

# 2

ఒక ప్రాంతం చరిత్ర ప్రస్ఫుటంగా తెలియాలంటే, ఆ ప్రాంతంలోని వ్యక్తులు, వారి చరిత్ర, వారి రచనలలోని వాస్తవాలు బయటకు తీయాల్సి ఉంటుంది. రాజకీయంగా మలుపులు తిరుగుతూ పరిస్థితులకు అనుగుణంగా మారుతున్న విలువలను కూడా అంచనా కట్టాల్సి ఉంటుంది. ఆ ప్రాంతంలోని సాంఘిక జీవనం, రాచరికవ్యవస్థ, ధార్మికజీవనం, ఆర్థికజీవనం, సాంస్కృతిక, సాహిత్యచరిత్ర ఏది కావాలన్నా ఆ ప్రాంతంలోని, ఆ యా కాలాల్లోని వ్యక్తుల చరిత్ర తెలుసుకోవడం ముఖ్యం అవుతుంది. † ''ఒకజాతి సారస్వతం ఆ జాతి జాతీయజీవనమునకు అద్దం వంటిదని'' శ్రీ దేవులపల్లి రామానుజరావు గారు అన్నట్లుగా సంఘ జీవనమునకు సాహిత్యమునకు ఒక విధము అయిన అవినాభావ సంబంధము ఉన్నదని చెప్పవచ్చును.

ఈ నేపథ్యంలో నేను సేకరించిన విషయాలతో వరంగల్లు జిల్లా రచయితలకు (ఓరుగల్లు మండలం) సంబంధించిన సాహిత్య వికాసమును తెలుపడమే ఈగ్రంథం యొక్క ముఖ్యఉద్దేశము. ఒక జిల్లా సాహిత్య చరిత్రను పరిశీలించినప్పుడు కొన్ని సాంకేతిక పరమైన ఇబ్బందులు ఎదురు అవడం మనకు సహజంగానే అడ్డుతగులు తుంటాయి. ''**వరంగల్లు జిల్లా రచయితల వాఙ్మయ జీవిత సూచిక**''ను క్రోడీకరించినప్పుడు ఎదురైన ఇబ్బందులను దృష్టిలో ఉంచుకొని తన రచనను అచ్చురూపములో (పుస్తకంగా) ప్రకటించిన రచయితలను మాత్రమే ఇందులో పేర్కొనడం

---

† దేవులపల్లి రామానుజరావుగారి ''సారస్వత నవనీతము''- పు:-51

జరిగినది. ఇలా ఒక హద్దును గీసుకొనక పోవడంవలన పుస్తకం అస్తవ్యస్తం గాను, ప్రణాళిక లేకుండా తయారు కావడానికి అవకాశం ఉంటుంది.

వరంగల్లు జిల్లా రచయితలను గురించి పరిశోధన సాగించినప్పుడు ఎంతోమంది కవులు, పండితులు, విజ్ఞాన శాస్త్రకోవిదులు, జ్యోతిష శాస్త్ర వేత్తలు, అలంకారికులు, తాత్వికులు, వాస్తుశాస్త్రజ్ఞులు, భూగోళ, ఖగోళ శాస్త్రజ్ఞులు, విమర్శకులు ఎందరో తటస్థపడ్డారు. అంతే కాకుండా ఎన్నో కుతూహలమైన విషయాలు బయల్పడినవి. నా పరిశోధనా పథంలో ‡ తాళపత్రి గ్రింథాలను చూసాను. * 1820 ప్రాంతంలో కోరుట్ల, ఇంగ్లాండులలో తయారు అయిన పేపరులలో వ్రాసిన వ్రాత ప్రతులను కూడా చూసాను.

తగిన ప్రోత్సాహంలేక, తన తృప్తికొరకు వ్రాసుకొనిన భావ వీచికలను తనే భద్రపరచుకోవడం, ముద్రించడమునకు ఇష్టంలేక కొంత అయితే, ఆర్థికవనరులు లేక కొందరు పుస్తకాలను వెలుగులోనికి తీసుకొని రాలేదు. వెలుగులోనికి వచ్చినవి, రానివి సరియైన భద్రితలేకపోవడంవలన శిల్యం అయిపోయినవి చాలాఉండి పోయినవి. నా ప్రియత్నంలో భాగంగా రచయిత అని తెలిసిన ప్రితివ్యక్తి వివరాలు సేకరించడానికి ఆయా వ్యక్తుల సంబంధీకుల దగ్గరకు వెళ్ళడం జరిగింది. కొందరు సమాచారం ఇచ్చారు, మరికొందరు తర్వాత రమ్మని మళ్ళీ, మళ్ళీ చెప్పి నేను కనబడగానే మేమే వ్రాసి పంపి స్టాంపు తిప్పిపంపినవారు కూడా ఉన్నారు. దూరంగా ఉన్న రచయితల దగ్గరకు పోలేని పరిస్థితులలో ఈ క్రింది వివరాలను పంపి దానిని నింపి పంపమని కోరాను, తిరుగు స్టాంపుల కవరుతో పాటుగా—

‡ ఉనికిచర్ల గ్రామంలోని బ్రాహ్మలవారింట్లో ఇల్లు దులుపుతున్నప్పుడు తాళపత్రి గ్రింధాలు బయటపడినవి. 1967 లో ఒక తమ్మల కులస్థుడు వాటిని తీసుకెళ్ళాడు, తరువాత వాటికొరకు ప్రియత్నం చేయగా అవి లభ్యపడలేదు.

* మడికొండలో శ్రీ గోపాలకృష్ణారావు గారింట్లో పండరినాధ రామాయణం వ్రాత ప్రతిని చూడవచ్చును. దానిని శ్రీ హనుమంతరావుగారు పరిష్కరించి ముద్రించారు 5, 6 సం॥ల క్రితం.

## వరంగల్లు జిల్లా రచయితల వాఙ్మయ జీవిత సూచిక

1. పేరు :
2. జననం :
3. విద్య :
4. వృత్తి :
5. స్వస్థలం :
6. చిరునామా :
7. బిరుదములు :

వగైరా

1. ముద్రితములు (సం॥రముతో సహా)

2. అముద్రితములు

గమనిక :- ముద్రితము అయిన ప్రతి వీలు అయినచో ఒకటి పంపండి. లేదా ప్రచురణకర్తల వివరాలు తెల్పండి.

పై నా అభ్యర్థనను మన్నించి కొందరు నింపి పంపారు. మరి కొందరు పంపలేదు మళ్ళీ గుర్తు చేసినా. నిరాశపడకుండా నా పరిశోధనను ముందుకు సాగించాను. పుస్తకంపంపకుండా ప్రచురణకర్తల వివరాలు తెలిపితే వారికి వ్రాసి ధృవీకరించు కొనినాను.

వరంగల్లు జిల్లా రచయితల వాఙ్మయ జీవిత సూచికను తయారు చేయడంలో నాకు కొన్ని గ్రంథాలు కూడా తోడ్పడినవి. కొంత మంది రచయితల పుస్తకాల పేర్లు కూడా లభ్యంకాలేదు. సమకాలీన రచయితలను పేర్కొని నప్పుడు మాత్రము వారి రచన ఒక్కటైనా పుస్తకంగా వచ్చి నప్పుడే ఈ వ్యాసంలో ఉటంకించడం జరిగింది. బహుముఖంగా వ్రాస్తున్న కొందరి రచయితలను అనుబంధంలో పేర్కొనడం జరిగింది.

# 3

ముందుగా ఈ వ్యాసంలో **1900** సంవత్సరమునకు ముందుగా వచ్చిన వారిని పేర్కొంటాను. ఇలా పేర్కొనడం వలన **1900** సంవత్సరమునకు ముందున్న సాహితీమూర్తులు, వారి సాహిత్యం తెలుసుకోవడానికి అవకాశం ఉంటుంది. ఇది ఎంతో సబబుకూడా-

1. మారన మహాకవి/మార్కండేయ పురాణము
2. భాస్కరుడు, మల్లికార్జునుడు, కుమార రుద్రదేవుడు. అయ్యలార్యుడు/ భాస్కర రామాయణము కర్తలు
3. జాయప సేనాని/నృత్త రత్నాకరము
4. విద్యానాథుడు/ప్రతాపరుద్ర యశోభూషణము
5. రుద్రదేవ చక్రవర్తి/నీతిసారము
6 శివదేవయ్య/పురుషార్థసారము
7. గంగాదేవి/మధురా విజయము
8. రావిపాటి త్రిపురాంతకుడు/ప్రేమాభిరామము, త్రిపురాంత కోదాహరణము, అంబికా శతకం, మదనవిజయం
9. †అగస్త్యుడు/నలకీర్తి కౌముది, బాలభారతము ఇంకా 74 గ్రంధాలు రచించినట్టుగా తెలుస్తున్నది. (ఇతనినే విద్యానాథ కవియని పిలిచినట్టుగా తెలుస్తున్నది)
10. చక్రపాణి రంగనాధుడు/నయనగతిరగడ
11. పాలకుర్తి సోమనాధుడు/బసవపురాణము, వృషాధిపశతకం, సోమనాధ భాష్యం, పండితారాధ్య చరిత్ర, రుద్రభాష్యం, చతుర్వేద సారం

---

† వరంగల్ దర్శిని 1986) శ్రీ సంపత్కుమారగారి వ్యాసం

12. మల్లికార్జున పండితారాధ్యుడు/శివతత్వ సారము
13. పిడపర్తి సోమనాథుడు/బసవపురాణము, ప్రభులింగము
14. కానె సర్వప్ప/సిద్దేశ్వర చరిత్ర, ప్రతాపచరిత్ర
15. పిడుపర్తి బసవప్ప/బసవపురాణము
16. పిడుపర్తి బసవకవి/వీరశైవదీక్షాబోధ బ్రహ్మోత్తర ఖండములు
17. నాగనాథ కవి/మదనవిలాసం (సంస్కృతం), విష్ణుపురాణం
18. కొరవి గోపరాజు/సింహాసన ద్వాత్రింశిక
19. విశ్వేశ్వర శివదేశికులు/శివతత్వరసాయనము, పురుషార్థసారము
20. బమ్మెర పోతనామాత్యులు/మహాభాగవతము, భోగినీదండకము, నారాయణ శతకము
21. ఆచ్చిరామానుజాచార్యులు/ముముక్షు జనకల్పకము, తత్వార్థ దర్పణము (ద్విపదకావ్యం) మోక్షసారం
22. ఆచ్చి లక్ష్మణాచార్యులు/ముముక్షు జనకల్పకము
23. ఆచ్చి సింగరాచార్యులు/ఆర్చిరాది ప్రబంధం
24. తిరునగరి వేంకటాచార్యులు/యతిరాజవింశతి
25. వెన్నెలకంటి చంద్రశేఖరకవి/హరిశ్చంద్ర చరిత్ర (ద్విపద)
26. ఏకామ్రనాథుడు/ప్రతాప చరిత్రము, ద్వాత్రింశత్యాల భంజికలు
27. గోన బుద్ధారెడ్డి/చంద్రికాపరిణయశ్లేషకావ్యం, రంగనాథరామాయణం
28. కేసన మల్లనలు/దాక్షాయణీ పరిణయం, విష్ణుభజనానందము
29. బద్దెన/సుమతీశతకము
30. † పరశురామ పంతుల లింగమూర్తి (1750) (శనిగరం-వరంగల్లు)/ సీతారామాంజనేయ సంవాదం, రతీమన్మథ విలాసం, సీతపాట, సాంఖ్యాయోగం, మనశ్శతకం, ఆత్మరామగోవింద శతకం

---

† ఆంధ్రశతక సాహిత్యవికాసం- డా॥ కే. గోపాలకృష్ణరావు మరియు ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రచురణ

31. పరశురామ పంతుల రామమూర్తి (1800) / సీతారా మాంజనేయం (యక్షగానం) శుకచరిత్ర, ఆధ్యాత్మ రామాయణం, ఈదులవాయి రామస్వామి శతకం, పరుశరామ శతకద్వయం, మనోహర శతకం
32. ‡ పరశురామ పంతుల అనంతరామకవి / హనుమద్విజయం, సీతా విజయం (సంస్కృతం)
33. నెల్లుట్ల నారాయణ/వజ్రాభ్యుదయం
34. వెలగందల నారయ/భాగవత పూరణం
35. హరిభట్టు
36. ఆదిరాజు వీరభద్రరావు
37. ముసిపట్ల పట్టాభిరామారావు
38. గార్లపాటి రాఘవరెడ్డి (తిరుమలగిరి) / పరిదేవనము, వేణుగోపాల శతకము
39. కంభంపాటి అప్పన్నశాస్త్రి/వేయిస్థంభాలగుడి శాసనము
40. సోమరాజు ఇందుమతిదేవి
41. నెల్లుట్ల రామకృష్ణకవి/సూరబాల (ఖండకావ్యం) భావార్ణవాది
42. అయితంరాజు కొండలరావు/ఉర్దూ- తెలుగు నిఘంటువు
43. మామునూరి నాగభూషణరావు
44. వీరవల్లి నరసింహాచార్యులు/నిజాంరాష్ట్రాంధ్ర ప్రప్రథమ శతావధాని
45. అల్లూరి రాజేశ్వరకవి
46. చిలుకూరి శ్రీరాములు
47. ఒద్దిరాజు లక్ష్మినరసింహారావు
48. ఆవుల పురుషోత్తమ దాసు
49. మాచేటి వరదరావు

‡ పరశురామ పంతుల లింగమూర్తిగారికి ఐదవతరంవాడు. (స్రవంతి ఏప్రిల్ 62)

50. కొండపర్తి వీరమల్లు
51. చాగంటి భాస్కరలింగ శాస్త్రి
52. మురళీధర నరహరిరావు
53. గుండా రాజమౌళి
54. కాశూరి రాజేశ్వరరావు
55. తిరువాయిపేట రంగయ్య
56. సూరి
57. జ్ఞానమాంబ
58. లక్ష్మణసింగు (జఫర్‌గడ్)
59. పలిపెల వెంకటఅప్పారావు
60. జమలాపురం వెంకటరామారావు
61. బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రి
62. గంగు కృష్ణదాసు
63. కొండపల్లి రామచంద్రరావు
64. బండి వేంకటరామారెడ్డి
65. పొట్లపల్లి వేంకటేశ్వరరావు
66. కందాళ శఠగోపాలాచార్యులు
67. ఆకుల లక్ష్మీనారాయణ
68. నల్లాన్ చక్రవర్తుల వేంకట పెన్నరంగాచార్యులు
69. భవానీసింగు ఠాకూరు
70. శ్రీరాముల లక్ష్మీనారాయణ
71. పుతుంబాక దుర్గాప్రసాదరావు
72. కొండపల్లి గోపాలరావు
73. హరి రామలింగశాస్త్రి

74. నల్లాన్ చక్రవర్తుల ప్రతాపరాఘవాచార్యులు
75. మాచేటి గోపాలరావు
76. పులిపాక మహానందశాస్త్రి
77. బొమ్మకంటి యోగానందరావు
78. మోటుపల్లి కృష్ణమాచార్యులు
79. గొట్టుపర్తి సుబ్బారావు
80. గుండా ముక్తిలింగము
81. తంయ్యాల లక్ష్మినరసింహాచార్యులు
82. కటారి మాణిక్యరావు
83. కె. వి. నరసింహాచార్యులు
84. సముద్రాల లక్ష్మినరసింహాచార్యులు
85. కాళూరి సీతారామారావు
86. రేమిడిచర్ల వేంకటకృష్ణారావు
87. వనం వేంకట నరసింహారావు
88. ఊటుకూరి సూర్యనారాయణరావు
89. పడగం రాజేశ్వరరావు
90. సి. ఇ. అండూ్రిను (హసన్‌పర్తి ప్రాంతం)
91. ముదిగొండ మల్లనారాధ్యకవి
92. బొమ్మినేని రాజిరెడ్డి
93. నేరెళ్ళ నరసింహరాయకవి
94. వనం వేంకటనరసింహారావు
95. నెల్లుట్ల నరసింహారావు
96. † అనుముల పండరినాధశాస్త్రి/సంస్కృత శతకము

---

† శ్రీ అనుముల కృష్ణమూర్తి తండ్రిగారు

97. ‡ అనుముల విశ్వనాథశాస్త్రి గిరిజా కళ్యాణము (యక్షగానం) వేణు గోపాల శతకము

98. * మోతుకూరి పండరినాథరావు/పండరినాథ రామాయణం, రామకథా కల్పలత

99. ♦ ముదిగొండ శంకరశాస్త్రి/శంకర శతకం

100. సుంకరనేని ఫణికుండలుడు/సీమంతినీ విలాసం, విజయ విలాసం

101. § సుంకరనేని రాజమౌళి (1858)/సుభద్రా పరిణయమ్ (యక్షగానమ్) మొదలగువారు—

ఈ నేపథ్యంలో వరంగల్లు జిల్లా సాహిత్య చరిత్రను పరిశీలించినప్పుడు ప్రస్తుతం ఉన్న సాహితీమూర్తులను పరిచయం చేయాలనే దృక్పథంతో నా పరిశోధనను ముందుకు సాగించి కొంతవరకు కృతకృత్యుడను అయినాననే చెప్పుకొనవచ్చును. సాహిత్య సృష్టి నిరంతరం పారే జీవనది ఇందులో ఎన్నో సెలయేళ్ళు కలుస్తూనే ఉంటవి.

---

‡ అనుముల శ్రీకృష్ణమూర్తిగారిని పెంచుకున్న తండ్రి

* వీరి మనుమడు హనుమంతరావుగారు ఇటీవల పండరినాథ రామాయణంను ప్రచురించారు

♦ వీరు వరంగల్లులో ఆకారపు నరసింగంశ్రేష్ఠిగారితో కలిసి సంస్కృత కళాశాలను నెలకొల్పారు. నీలకంఠులవారు రచించిన బ్రహ్మ సూత్రాలను, భగవద్గీతను విపుల పీఠికలతో ప్రచురింప చేసారు.

§ 24–5–1987 జనధర్మ వారపత్రికలో శ్రీ ముదుంబై వరదాచార్యులుగారి వ్యాసం చూడండి.

4

ఈ సందర్భంలో శ్రీ కోవెల సంపత్కుమారాచార్యులుగారు పరిచయం చేసిన రచయితల వివరాలను ఇక్కడ పొందుపరుస్తున్నాను.

1) రంగరాజు కేశవరావు (1830-1904)
జననం : ఖిలాషాపురము
ఇంద్రద్యుమ్నీయం, దాశరథి శతకము

2) మాడభూషణం రంగాచార్యులు (1837-1912)
జననం : నెల్లికుదురు, మహబూబాబాదు
రామానుజ రహస్యత్రయ వివరణ (తమిళం), ప్రసన్న జన జీవాతువు (తమిళం), తిరునామములు (తెలుగు)

3) తూము రామదాసు (1856-1904)
జననం : వరంగల్లు
నిర్వచన మిత్రవిందోద్వాహం, కాళీదాసు, ఆంధ్ర పదనిదానము (నిఘంటువు), రుక్మిణీ కళ్యాణం, గోపికా విలాసం

4) మరింగంటి లక్ష్మణదేశికులు (1864-1930)
జననం : గూడూరు నివాసం : మల్లంపల్లి, ములుగు
తిరునామములు, లక్ష్మీనృసింహస్తోత్రం (సంస్కృతం)

5) అమరవాది నారాయణాచార్యులు (1874-1937)
జననం : తోటపల్లి (కరీంనగరం), నివాసం : వరంగల్లు

రామానుజ యశోభూషణం, సుదర్శన శతక వ్యాఖ్య. సీతా కళ్యాణం నాటకం (అసంపూర్ణం)

6) నల్లంతిగళ్ చక్రవర్తుల
తంయ్యాల లక్ష్మీనరసింహాచార్యులు (1884-1959)
జననం: వరంగల్లు
అచ్చతెనుగు కుబ్జా కృష్ణవిలాసం, శ్రీ వేల్పుగొండ లక్ష్మీ నృసింహ క్షేత్రమహాత్యం, ముకుంద శతకం, రమేష శతకం

7) కోవెల రంగాచార్యులు (1885-1967)
జననం: నెల్లికుదురు, మహబూబాబాదు
చన్నూరు వెంకటేశ్వర సుప్రభాతం, తత్వత్రయార్థ ప్రకాశిక

8) దూపాటి వేంకటరమణాచార్యులు (1892-1975)
జననం: గుంటూరు. నివాసం: హన్మకొండ
విక్రమోర్వశీయం. సమర్థ రామదాసస్వామి, వసుంధర, రంగధామ శతకము, స్వర్ణమేఖల, శకుంతల నాటకం. వీరు వరంగల్ ప్రాంత సాహిత్య చరిత్రకు ముఖ్యకారకులు

9) అంబటి లక్ష్మీనరసింహరాజు (1892)
జననం: ఆత్మకూరు, ములుగు
కర్ణాభ్యుదయం. అర్జునాభ్యుదయం, త్యాగరాజు చరిత్ర, గజేంద్ర మోక్షం, పాండవ ప్రభావం, ప్రచ్ఛన్న పాండవం, రఘువీర విజయం, యాదగిరి నృకేసరి

10) ఒద్దిరాజు సీతారామచంద్రరావు (1887)
జననం: ఇనుగుర్తి, మహబూబాబాదు

వీరు రాఘవరంగారావుగారి అన్నగారు. వీరు ఇద్దరుకలిసి † 'తెనుగు' పత్రికను 1921 లో స్థాపించారు. విజ్ఞాన ప్రచారిణీ గ్రంథమాలను స్థాపించి ఎన్నో గ్రంథాలను ప్రచురించారు.

ఉత్సవానందము, సమయ సమరము, కృష్ణస్తవము, శ్రీస్తుతిసౌదామిని (ప్రబంధం), అనాథబాల, ఖడ్గతిక్కన, లోకేశ్వరశతకము, ప్రపంచ స్వరూపము, శశవిషాణము, ప్రేమ ప్రవాహము, రుద్రమదేవి (నవల), శౌర్యశక్తి (నవల), భ్రమర (నవల), బ్రాహ్మణ సాహ సము, చేతిపనులు, ఛాయాకర్షణము, ముక్తలవ, ఇరువురు మగలు, నాగరిక భార్య, గురుదక్షిణ, చ్యవన ప్రతిజ్ఞ, మాతృదాస్య విమోచ నము, రక్తతర్పణం, పితృబంధనము, ప్రయోగనిదర్శనము, మైత్రి పరిణితి, ఆంగ్లవ్యాకరణము, ఎఱువుసొమ్ము, జమీందారీ తీరు, మేన రికము, నౌకా భంగము, ఉపదేశ రత్నమాల, భక్తిసార చరితం (నాటకం), చాటువులు, వివిధ వ్యాసములు- కవులు, మగసంసారం, ఆడపెత్తనం, విద్యుద్విజ్ఞానము, శారీరక విజ్ఞానం, బాల విజ్ఞానము, రక్తాంజలి (నవల) మొదలగునవి.

## 11) ఒద్దిరాజు రాఘవ రంగారావు (1893)

జననం : ఇనుగుర్తి

సౌదామిని, తపతీసంవరణోపాఖ్యానమ్, మాణ్‌మాడంగళ్, సప్త గాథావ్యాఖ్య, అష్టాధ్యాయి, భట్టికావ్య, వాక్యగురుపరంపర, ఆర్తి ప్రబంధం, వీరావేశము (నవల), వరాహముద్ర (నవల), పంచకూళ కషాయము, చాటువులు- కథలు

## 12) గంగుల శాయిరెడ్డి (1893–1975)

జననం : జీడికల్, జనగామ

† తెలంగాణము నుండి వెలువడిన మొట్టమొదటి పత్రిక

కాపుబిడ్డ, వర్షయోగం, గణిత రహస్యం, మద్యపాన నిరోధము, తెలుగు పలుకు, ఆరోగ్య రహస్యం, మా ఊరు, ఐకమత్య ఆదర్శం, జీడికంటి మహత్యం

13) గొట్టుముక్కల రాధాకృష్ణరావు (1898)

జననం : బుట్టారెడ్డిగూడెం, (కరీంనగరం)

స్థిర నివాసం : హనుమకొండ

† ఋతుసంహారము, శ్రీశైల మల్లేశ్వర తారావళి (1948), రంగనాయక శతకము, విక్రం, సంపన్న గృహస్థు, భారత స్వాతంత్ర్య కథ, కాకతీయుల చరిత్రి

14) కోయిల్ కందాళై వేంకట సుందరాచార్యులు (1875-1934)

జననం : పెన్నాడ, పశ్చిమ గోదావరి జిల్లా

స్థిర నివాసం : నారాయణపురం: వరంగల్లు

శ్రీరామకాల నిర్ణయబోధిని, వీరాచల మహత్యం

15) ముదిగొండ శంకరాధ్యులు (1854-1924)

జననం : నందిగామ, కృష్ణా జిల్లా

స్థిర నివాసము : వరంగల్లు

తటస్థ గ్రామపంచరత్నములు, భావలింగ శతకము, మల్లికార్జున శతకము, ప్రపన్న విజ్ఞానం, ఆత్మప్రకాశినీ కంఠమాల

† ఇందులో ఇతరుల పద్యములు కూడా కలపు– చూడుడు ఆంధ్రశతక సాహిత్య వికాసం

మనోరమ, కేశవనాధశతకము, మోహసాహనము, శేషగిరిరాయ శతకము; భూపతారావళి, రామావతార కారణము, రాచరుసి, నీతి ముకురము, కరీమా, పేకసంహిత, శృంగారతరంగిణి (సంస్కృతం) శారదాస్తుతి (సంస్కృతం)

8) హరి రాధాకృష్ణమూర్తి (1907-1979) †
జననం : వానపాముల (కృష్ణా జిల్లా)
స్థిరనివాసం : శ్రీకృష్ణకాలనీ, వరంగల్లు

త్రిపురారహస్యము, కథాత్రయి, ముకుందమాల, సౌందర్యలహరి, ధర్మధ్వజము, సులభవ్యాకరణము, లలితాసహస్రనామభాష్యము

9) కాళోజి రామేశ్వరరావు (1908)
జననం : మడికొండ
నివాసం : నక్కలగుట్ట, హన్మకొండ

కలామ్-ఎ-షాద్ (1985) ఉర్దూ ముషాయిరాలు. దీనిని క్యాసెట్‌గా విడుదల చేసారు. తెలుగు కవితా సంపుటి వెలువడవలసి ఉన్నది.

10) పల్లా రామకోటార్య (1911)
జననం : పోలంపల్లి (కృష్ణా జిల్లా)
స్థిర నివాసము : గిర్మాజిపేట, వరంగల్లు

వినగదప్ప వెజ్జీ వెంగళప్ప-షట్కృతి (1973), నానార్థ పద నిక్షేపం (40-46) అకారాది క్రమముగా మ అక్షరంవరకు, మానవశతకము, ఆర్య కుమారశతకము; స్వర్గంలో సమ్మె (ఉత్పలమాలిక), వైదిక శిష్టాచారము (81) అనువాదం, వైదిక సంధ్యావందన విధి (68) అనువాదం

† వివరాలకు శ్రీ కోవెల సంపత్కుమారాచార్యులగారి గ్రంథం చూడండి

11) అమరవాది వేంకటనరసింహాచార్యులు (1913) †

జననం : వరంగల్లు

యదువీరగద్య, కురఙ్గపంచకమ్, గోదాగాథ, యాదాద్రి నృసింహ పంచశత్, నక్షత్రమాలిక, రామచంద్ర సుప్రభాతమ్, ఆపదుద్ధారక స్తవః, దుష్ప్రథప్రతిషేధం, అభీతిస్తవం, ఇవన్నీ సంస్కృత గ్రంథాలు, ఆర్చిరాది, చరమపర్వ చూడామణి, అపరాధ పరిహారం మొదలగు తమిళ గ్రంథాలు, యాదగిరి క్షేత్రమహిమ (తెలుగు)

12) కాళోజి నారాయణరావు (1914)

జననం : మడికొండ,

నివాసం : నక్కలగుట్ట, హన్మకొండ

నా గొడవ 7 భాగాలు, జీవనగీత, కాళోజీ కథలు, తుదివిజయం మనది (అక్షర రక్ష), స్వాతంత్ర్యోత్సవం

13) వృక్షాల జగన్నాథం (1914–1985)

జననం : హన్మకొండ, వరంగల్లు

వేదాంత తత్త్వార్థ దర్పణం అను వేదాంత నిఘంటువు (68)

14) టంకసాల నరసింహారావు (1915)

జననం : మడికొండ నివాసం : ఖిలా వరంగల్లు

నిత్యప్రార్థన గీతావళి, మనము-మనదేశం, ప్రపంచంలో మనుగడ, గీతావళి, మహాత్ముని జీవితంలో మహత్తర ఘట్టాలు

† వివరాలకు శ్రీ కోవెల సంపత్కుమారాచార్యులగారి గ్రంథం చూడండి.

15. దర్భశయనం అయ్యమాచార్యులు (1915) †

జననం : సూరిపల్లి, నర్సంపేట తాలూకా, వరంగల్లు

చెన్నకేశవ సన్నుతి తారావళి, రామచంద్ర ప్రభు శతకము

16) పల్లా దుర్గయ్య (1916–1984)

జననం : మడికొండ, వరంగల్లు,

ఉస్మానియా విశ్వవిద్యాలయంలో పని చేసారు

గంగిరెద్దు(కావ్యము), మాయరోగము(నాటిక), పాలవెల్లి(కవిత). చతురమతి, ప్రబంధవికాసం (విమర్శలు)

17) దేవులపల్లి రామానుజరావు (1917

జననం : బొల్లికుంట, వరంగల్లు

దేశాయిపేటకు దత్తత వచ్చారు, న్యాయవాదిగా వృత్తిని సాగించారు. ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ, ఆంధ్ర సారస్వత పరిషత్‌లకు అధ్యక్షులుగా ఉన్నారు. కొంతకాలం ''శోభ'' పత్రికను నడిపారు. సారస్వత నవనీతము, హైదాబాదులో స్వాతంత్రోద్యమం, సాహిత్యోపన్యాసాలు, మా-రేడియోప్రసంగాలు, గౌతమబుద్ధ, తెలుగు సీమ, భారతదేశం, పచ్చతోరణం, తెలంగాణాలో సాంస్కృతిక పునరుజ్జీవనము, తెలంగాణాలోజాతీయోద్యమం, తలపులదుమారం. బంకించంద్ర ఛటర్జీ, జవహర్‌లాల్ నెహ్రూ, ఆదిమనివాసులు. వ్యాసమంజూష, ఉర్దూలో తెలుగుసాహిత్య చరిత్ర, ఏభై సంవత్సరాల జ్ఞాపకాలు మొదలగు రచనలు

వీరికి అభినందనపరంగా ''అక్షరదీపం''అనే గ్రంథం 1985లో ప్రచురించారు

---

† వివరాలకు దర్పణం (1987) కవితా సంకలనం– సంపాదకుడు యం. వరదాచార్యులు, నర్సంపేట

18) పొట్లపల్లి రామారావు (1920)

జననం : తాటికాయల,

ధర్మసాగరం మండలం, వరంగల్లు వ్యవసాయం

మా ఊరు, చుక్కలు, జేలు (కథానికలు), పగ (నాటిక)

19) పాములపర్తి సదాశివరావు (1920)

జననం : మట్టెవాడ, వరంగల్

చరిత్ర, కళ, సంస్కృతి, తత్వశాస్త్ర ప్రాథమిక పాఠాలు, భారతీయ సాహిత్య పరిశీలన, జ్ఞాన సిద్ధాంతము, అభ్యుదయ గీతాలు మొదలగు రచనలు

వీరు కాకతీయ వారపత్రికను నడిపారు

20) అద్దూరి అయోధ్యరామకవి (1922) †

జననం : ఇల్లంత, వరంగల్లు

స్థిరనివాసం : హైదాబాదు

"భాగ్యనగర్" పత్రికా సంపాదకులు- దీపావళి, ఘంటారావము, ఆంధ్రకేసరి, స్వాతంత్ర్య గీతాలు, తెలంగాణా మంటల్లో......., తాటికొండ, అన్నపూర్ణేశ్వరశతకం, సీతారామశతకం, సంస్కరణలు (బుర్రకథ), ప్రజావిప్లవం- విజయం (బుర్రకథ), రుద్రమదేవి (నాటిక)

21) అనుముల కృష్ణమూర్తి (1924)

జననం : మడికొండ ,వరంగల్లు

"రసబ్రహ్మ" బిరుదాంకితులు

---

† వివరాలకు "హైదాబాదు నగర తెలుగుభాషా సాహిత్య చరిత్ర" (1985) డా॥ ఓగేటి అచ్యుతరామశాస్త్రి

సరస్వతీ సాక్షాత్కారము (1968), రసలోకం, శబరి, పోతన లఘు కావ్యాలు

22) **చిలుకమర్రి రామానుజాచార్యులు (1924-1967)**

జననం : జఫర్‌గడ్ (వేల్పుగొండ)

నివాసం : మట్టెవాడ, వరంగల్లు

కళ్యాణ రాఘవం, స్తోత్రాంజలి, మధురవేదన, గీతాంజలి (అనువాదం) మొదలగు రచనలు

23) **మోతుకూరి మధుసూధనరావు (1924)**

జననం : మడికొండ, వరంగల్లు

శ్రీ వెంకటేశ్వర శతకం (72)

24) **టి. వి. సుబ్బారావు (1924)**

జన్మస్థలం : తెన్నేరు, కృష్ణాజిల్లా

స్థిరనివాసం : కిషన్‌పుర, హన్మకొండ

పరీక్షకాలు, మాపనము, దృశ్యశ్రవణవిద్య (1967&70), పాఠశాలా పరిశాసనము (86), పాఠ్య పరిణాశికా వివర్ధనము, Teaching of Languages, Health Education- (భాషా శాస్త్రమునకు సంబంధించినవి). Studies in Physoclogy కాకుండా వీరు గైడ్లుకూడా వ్రాసారు

25) **దెందుకూరు (డి.) సోమేశ్వరరావు (1924)**

జననం : & స్థిరనివాసం : కిషన్‌పుర, హన్మకొండ

మన చిత్రకళా సంపద (1975), 12 వ్యాసములు (చారిత్రిక పరిశోధన), Thousand Pillars Temple of Rudreshwara, Hanamkonda; Ramappa.

26) బిరుదురాజు రామరాజు (1925) †

జననం : దేవునూరు, (ధర్మసాగరం మండలం)

స్థిరనివాసం : చిక్కడపల్లి, హైదాబాదు

మడికొండకు దత్తత వచ్చారు. కాకతీయ విశ్వవిద్యాలయం, ఉస్మానియా విశ్వవిద్యాలయాలలో పని చేసారు. జానపద గేయ సాహిత్యంపై పరిశోధన చేసారు.

తెలుగు వీరుడు (1952), వీరగాథలు (1954), తెలుగు జానపద గేయ సాహిత్యం (1958&78), మరుగుపడిన మాణిక్యాలు (1961) ఉర్దూ- తెలుగు నిఘంటువు (1962), ఫోక్ టేల్స్ ఆఫ్ ఎ. పి. (1974), ఫోక్ లోర్ ఆఫ్ ఎ. పి (1978) విన్నపాలు (సాయి బాబాపై వెలువరించినది)

గురుగోవిందుసింగు చరిత్ర (1966), ప్రేంచంద్ (1971)లో అనువాదాలు; పల్లెపట్టు (నాటకం), తెలంగాణా పిల్లల పాటలు (1969), త్రివేణి (1960), తెలంగాణా పల్లెపాటలు (1968) సంపాదకత్వం, ప్రసన్నరాఘవనాట్య ప్రబంధం(1961), రాఘవాభ్యుదయం(1965), శివరాత్రి మహాత్యం (1966) మొదలగు తెలుగు గ్రంథాలను పరిష్కరించారు. వసుచరిత్రమ్ (1985), జాంబవతీ పరిణయమ్ (1969), శృంగారశేఖరబాణమ్ (1969), రామాయణ సారతిలకమ్ (1972) మొదలగు సంస్కృత గ్రంథాలను పరిష్కరించారు. ఆంధ్రప్రదేశ్ జానపద సాహిత్య పరిషత్ అధ్యక్షులు

---

† కొంతకాలం వీరు డా॥ సి. నారాయణరెడ్డిగారితో కలసి "రామనారాయణ" పేరుతో జంటగా కవిత్వం వ్రాసారు. శ్రీ రామరాజుగారి షష్ఠిపూర్తి సభలో (12-4-1985 న) డా॥ సినారెగారు చెప్పారు.

27) భండారు సదాశివరావు (1925) †

జననం : వేములపల్లి (కృష్ణా జిల్లా)

స్థిర నివాసం : గాంధి దవాఖాన దగ్గర, వరంగల్లు

న్యాయవాద వృత్తిలో ఉన్నారు. ''సాధన'' పత్రిక సంపాదకులు. ''జాగృతి'' స్థాపక సహాయ సంపాదకులు, ''భారతీయ రచయితల సమితి''కి అధ్యక్షులు

జయసోమనాథ్ (1954), మహారాణాబాప్పా (1959), సామ్రాట్ చంద్రగుప్త మొదలగువాటిని అనువదించారు. మన వారసత్వం (1959), జనవిజయం (1978), స్మృతివీధి (1947), దేవాసుర సంపత్తులు (1947), మన రాష్ట్రవాదం (1947), భగవాన్ కృష్ణ (1947), వర్తమాన భారతీయ రాజనీతి (1947) మొ॥ గ్రంథాలు

28) పెండ్యాల శేషగిరిరావు (1925)

జననం : చిన పెండ్యాల, ఘనపురం మండలం

దాంపత్యం (కథల సంపుటి)

29) కొంపెల్లి ఆంజనేయశాస్త్రి (1925)

జననం : వరంగల్లు

నివాసం : శ్రీకృష్ణకాలనీ, వరంగల్లు

భాషాశిక్షణ (1972), భాషానైపుణ్యములు (1974), విద్యామానసిక శాస్త్రములు (1976)

30 తిరుకోవలూరు రామానుజస్వామి (1927)

జననం : పర్లపల్లి, (కరీంనగరం జిల్లా)

స్థిర నివాసము : విద్యారణ్యపురి, వరంగల్లు–9

శ్రీరామ శతకము (1983)

---

† పోతన పంచశతి (1982) ఉత్సవాలకు కార్యదర్శిగా పని చేసారు

31) యల్. వేణుగోపాలరావు (1929)

జననం : వడకాపురం (కరీంనగరం జిల్లా)

స్థిరనివాసం : యన్.జి.వో. కాలనీ, హన్మకొండ

వేణు తరంగాలు (1987)

32) కేతవరపు వేంకటరామకోటిశాస్త్రి (1931)

జననం : ఒంగోలు

స్థిర నివాసం : హన్మకొండ

కాకతీయ విశ్వవిద్యాలయం తెలుగు విభాగం
శత్రుంజయము, అనంగహేల, నైమిశం, సమీక్షణం, యయాతి చరిత్ర, తిక్కనకావ్య శిల్పము, మహాభారత తత్వదర్శనము, హరి హర నాథతత్వము, పోతన్నగారివైచిత్రి
విశ్వవిద్యాలయం నుండి వెలువడే ''విమర్శిని'' సాహిత్య సంచికకు సంపాదకులు

33) తిరునగరి మురళీధరస్వామి (1931)

జననం : ఊటూరు (కరీంనగరం జిల్లా)

స్థిర నివాసం : కొత్తూరు, హన్మకొండ

మనము- మన కావ్యాలు (1985)

34) పాలెం రఘుపతి (1933) †

జననం : వరంగల్లు

స్థిరనివాసం : గోపాలస్వామి బొమ్మలగుడి దగ్గర, వరంగల్లు

నటుడు- శిల్పం (వ్యాస సంపుటి) 1962

† ఈయన వరంగల్లు జిల్లాలో గర్వించదగ్గ నటుడు

35) గౌరిశప్ూడి విలసత్కళాధర్ (1933)

జననం: మేడిన్‌పేట,

స్థిర నివాసం: పాతబస్ డిపో దగ్గర, హన్మకొండ

అగ్గిపుల్లలు (1954), శ్రీవాసవీ పురాణము (1974), నేరము- శిక్ష (నాటిక) 1984

36) కోవెల సంపత్కుమారాచార్యులు (1933)

జననం & స్థిర నివాసం: రామన్నపేట, వరంగల్లు

తెలుగులో ఛందోపదకోశము, తెలుగులో ఆధునిక సాహిత్య విమర్శ సంప్రదాయం, మన కవులు, పండితులు, రచయితలు, నవభారతము ప్రణయకావ్యకథ (వ్యాసాలు) మధురగాధలు మొదలగు రచనలు. సుకవిమనోరంజనం, లక్షణసార సంగ్రహము, కవిత్రయ చందః ప్రయోగములకు పీఠికలను సమకూర్చారు,

37) శ్రీశైలం వీరబత్తిని (1934)

జననం & స్థిర నివాసం: చేర్యాల. జనగామ, వరంగల్లు

కిన్నెర (1979) కవితా సంపుటి

38) రాజ భద్రయ్య (1934-1980)

జననం & స్థిర నివాసము: వరంగల్లు- చిత్రకారుడు

రామప్ప శిల్పరహస్యములు (1986)

39) పేర్వారం జగన్నాథం (1934)

జననం: ఖిలాషాపురం, జనగామ, వరంగల్లు

స్థిర నివాసం: బాలసముద్రం, హన్మకొండ

సాగర సంగీతం (1960 & 85), సాహిత్యావలోకనం (1982), వృషభపురాణం (1984), ఆరె జానపద గాథలు (1986), ఇంద్రద్యుమ్నీయం (సంపాదకత్వం) 68, ఆరెజానపద గేయాలు (1987)

40) తిరునగరి కృష్ణయ్య (1934)
జననం : శ్రీపతిపల్లె, (ఘనపురం మండలం)
స్థిర నివాసం : ములుగు
వనమాలికి మణిమాలలు (1980)

41) కృష్ణాది కొండయ్య (1935–1983)
జననం : హన్మకొండ
ఓరుగల్లు కాకతీయాంధ్ర చరిత్ర (1982)

42) గులాం నబి (1935)
జననం : పెదకోడెపాక, పర్కాల, వరంగల్లు
స్థిర నివాసం : రాయపుర, హన్మకొండ
దిక్సూచి శతకము (1985)

43) బలభద్రపాత్రుని కేశవరావు (1935)
జననం & నివాసం : బాలసముద్రం, హన్మకొండ
స్థితి శాస్త్రం, ద్రవస్థితి, పరిక్రియాత్మక గణితము, వీరి గ్రంథాలన్నీ గణితంనకు సంబంధించినవి

44) కంభంపాటి హనుమంతరాజు (1936)
జననం & నివాసం : వరంగల్లు
నాలుగు బుర్రకథల సంకలనం (1985)

45) కోవెల సుప్రసన్నాచార్యులు (1936)
జననం : వరంగల్లు
స్థిర నివాసం : పరిమళకాలనీ, వడ్డెపల్లి, వరంగల్లు
జనధర్మ సాహిత్య ద్వైమాసికకు గౌరవ సంపాదకులుగా ఉన్నారు

హృద్గీత (1954), ఆనందలహరి (1956), రామరాజ భూషణుని కృతులు- పరిశీలన, తేజః చక్రము. దుఃఖయోగిని (1958), అధునా (1964), సాహిత్య వివేచన (1971), పాండిచ్చేరి పన్నెండు గీతాలు (1975), పాంచాలరాయశతకము (1976), ఋతుంభర (1974), సహృదయచక్రము (1983), అగ్నిగర్భ కవితాసంకలనం (1975) సంపాదకత్వం, శతాంకుర (1987) కవితా సంపుటి

46) శ్రీ శ్రీభాష్యం విజయసారథి (1936)

జన్మస్థలం : ఇందుర్తి (కరీంనగరం)

స్థిరనివాసం : శివనగర్, వరంగల్లు

ప్రహేళికలు- 2 భాగాలు (సంస్కృతం- తెలుగువ్యాఖ్య), మనోరమ (సంస్కృతం), మందాకిని (సంస్కృతం), హేమచంద్రుడు, భారతీయ ప్రత్మక్షమ్, ఆత్మదానమ్, విషాదలహరి, ప్రసాదలహరి, న్యాయశాస్త్రమ్ (సంస్కృతం), సంస్కృత రూపకములు- ప్రస్తావన (సంస్కృతం), సంస్కృత- ఆంధ్ర వసుచరిత్ర తులనాత్మక పరిశీలన (సంస్కృతం)

47) మాదిరాజు రంగారావు (1936)

జననం : పండితాపుల, ఖమ్మం జిల్లా

స్థిరనివాసం : విద్యారణ్యపురి, హన్మకొండ

వెలుగులో ఈనేలపై, మేల్కొన్న ఆకాశం, యుగసంకేతం, ఉష ఆగమనం, ముక్తకాలు, వయోలిన్‌పై రాగంతో, ముక్తధాత్రి, పడగెత్తిన ఉదయం, ఆవాహన, ఆనందధుని, మేల్కొన్న ఈ సమయం, శబ్దమై ప్రాణమై, వియత్నాం శాంతి కవితలు, కాలాన్ని నిలిపి ఈక్షణం (1978), నవలస్వరూప సమాలోచనం (1984), దాశరథి కవితా సమాలోచనం (1985), నాలో నది ప్రవహిస్తోంది

(1985), ఈతరం స్వరచిత్రం (1985), పరిశోధన- స్వరూపం (1986(, నాకు జ్ఞాపకం ఉంది (1987)

48) ఆవాల దామోదర్ రెడ్డి (1937)

జననం : మడికొండ

స్థిరనివాసం : స్థంభాలబావి దగ్గర కాజిపేట, వరంగల్లు

కలం పేరు ''కమలశ్రీ''

మెట్టుగుట్ట (1972), గానడోల (1975)

49) చిట్టిమల్లె శంకరయ్య (1938)

జననం : జనగామ, వరంగల్లు

స్థిరనివాసం : గణేశ్ వీధి, జనగామ

కలం పేరు ''రుద్రశ్రీ''

ముత్యాల సరాలు (1962), ఇంద్రచాపము (1969), ఆరాత్రికమ్ (1970), సాంబశివానందలహరి (1986), తెలుగు సాహిత్యంలో దేశీయ వైద్యం (1987)

50) గంగరాజు సుశీలాదేవి (1938)

జననం & స్థిరనివాసం: సిద్దంకి, జనగామ తాలూకా

చిట్టి ముత్యాలు, ఆర్ద్రహృదయం

51) బాసిరి సాంబశివరావు (1938)

జననం : ముప్పారం, ధర్మసాగరం మండలం

స్థిరనివాసం : కాజీపేట, వరంగల్

బాపూ నీదేశం చూడు, మనకర్తవ్యం బుర్రకథలు

52) వాసిరెడ్డి భాస్కరరావు (1939)

జననం : అల్లీనగరం, ఖమ్మం జిల్లా

స్థిరనివాసం : హన్మకొండ

గోడలకు నోళ్ళున్నాయ్ (1983), చార్లీచాప్లిన్ (1984)

53) పి. వి. రమణ (1939)

జననం : సికింద్రాబాదు

ప్రస్తుత నివాసం : నర్సంపేట, వరంగల్లు

ఆకురాలిన వసంతం, వెంటాడే నీడలు, దేవతలెక్కిన పడగ, చలి చీమలు అన్నీ నాటకాలు- తెలుగులో- సాంఘిక నాటకాలపై పరిశోధన- అద్దంలో చంద్రుడు (కథల సంపుటి) 1986

54) హరి శివకుమార్ (1939)

జననం & స్థిరనివాసం : శ్రీ కృష్ణకాలనీ, వరంగల్లు

కేతన, గద్వాల సంస్థానము, కాశీఖండము- పరిష్కర్త

55) బొడ్డు శ్రీశైలం (1939)

జననం & స్థిరనివాసం : రాఘవాపురం, ఘనపురం మండలం

పూదండ (1963) గేయాలు

56) వరవరరావు పెండ్యాల (1940)

జననం : చినపెండ్యాల, ఘనపురం మండలం

స్థిరనివాసం : కొత్తూరు (చివర), హన్మకొండ

''సృజన'' సంపాదకులు

జీవనాడి, చలినెగళ్ళు (1068), స్వేచ్ఛ, సముద్రం, ఊరేగింపు, భవిష్యత్తు చిత్రపటం (కవితా సంపుటాలు), ప్రజల మనిషి పరిచయం (1981), తెలంగాణా ఉద్యమం- నవల పరిశోధనాంశం (1986)

57) సి. హెచ్. రాములు (1940)

జననం : గుండమరాజుపల్లి, మహబూబాబాదు, వరంగల్

నివాసం : కాకతీయకాలనీ, హన్మకొండ

సూరదాసు కావ్య సౌందర్యం (తెలుగు), సూరదాసు పదామృతం (తెలుగు కావ్యానువాదం), మొల్లరామాయణం (హిందీ), తెలుగు కాబాల సాహిత్యే (హిందీ), భక్తి తత్వ ఔర్ తెలుగుకో భక్తి సాహిత్య (హిందీ), సూర్ ఔర్ పోతనాకె కావ్యమే భక్తితత్వ (హిందీ)

58) రేగులపాటి మాధవరావు (1940)

జననం : చింతలఠానా (కరీంనగర్)

స్థిరనివాసం : భవానీనగర్, ఫిల్టరుబెడ్‌రోడ్, హన్మకొండ

ప్రవేశ (హిందీ), స్వర్గపురిపర్‌హమ్లా (హిందీ), సవేరా (హిందీ), సాక్షి (హిందీ నవల)

59) గంగిడి వెంకటరెడ్డి (1940)

జననం & స్థిరనివాసం : తిమ్మాపురం, వరంగల్

కనువిప్పు నాటిక (1967)

60) శేషభట్టర్ వెంకటాచార్యులు (1940)

జననం : గుండేడ్పల్లి, నర్సంపేట, వరంగల్

నివాసం : హన్మకొండ

కవితా జ్యోతి (1986)

61) వెన్నవరం ఈదారెడ్డి (1941)

జననం & నివాసము : వేలేరు- వరంగల్లు

చలం నవలలు- సామాజిక చైతన్యం (1980)

62) ఇందారపు కిషన్‌రావు (1941)

జననం : తాండూరు (ఆదిలాబాదు)

స్థిరనివాసం : బాలసముద్రం, హన్మకొండ

శ్రీనివాస శతకము (1973), ఋతుసంహారము (1974)

63) నవీన్ (1941)

జననం : వావిలాల, వరంగల్లు

నివాసము : ఎక్సైజ్‌కాలనీ హన్మకొండ

అసలు పేరు : మల్లయ్య

అంపశయ్య (1969), సౌజన్య, సంకెళ్ళు, చీకటి రోజులు (1975), ముళ్ళపొదలు, విచలిత, మౌనరాగాలు, అగాధాలు మొ॥గు నవలలు

64) శీలం రాజేశం (1942)

జననం : పెద్దపల్లి, కరీంనగరం

నివాసం : లష్కర్‌బజార్, హన్మకొండ

పిలుపుల వలపులు (1967), రణవిజయం (1967)

65) పానుగంటి విశ్వనాథం (1942)

జననం : ధర్మపురి, (కరీంనగర్ జిల్లా)

స్థిర నివాసం : భవానీనగర్, పిల్లరుబెడ్‌రోడ్, హన్మకొండ

భ్రమర్‌గీత్‌ఏక్ అధ్యయన్ (హిందీ), సూర్‌కి బాల మనోవిజ్ఞాన్ (హిందీ)

66) ధర్మపురి సత్యనారాయణ (1942)

జననం : నల్లబెల్లి, వరంగల్లు

నివాసం : వరంగల్లు

సీతాకల్యాణం (1980), చైతన్య స్వరాలు (1982)

67) పల్లె శ్రీనివాసు (పల్లెశీను) (1943)

జననం & స్థిర నివాసం : నేరేడుపల్లి, శాయంపేట మండలం

రుధిరాంకితం నవల (1966), రాధమ్మ పెళ్ళి-నాటిక (1967)

68) వనం మధుసూధన్ (1943)

జననం & స్థిర నివాసం : శంభునిపేట, వరంగల్లు

ఒకరూపాయి (నాటిక), అమ్మయ్యో గాంధి బ్రతికాడు (నాటిక), జీర్ణజీవితాలు (నాటిక). తెలుగులో ఏకాంకికలు పరిశోధన

69) పింగిళి రంగారావు (1943)

జననం & నివాసం : నక్కలగుట్ట, హన్మకొండ

వినడానికో కథ కథల సంపుటి (1979), మారిన మనుషులు నాటిక

70) పబ్బా శ్రీశైలం (1943)

జననం : జనగామ

నివాసం : కొత్తూరు చివర, హన్మకొండ

''చినుకు'' కవితా సంపుటి (1985)

71) వై. విద్యాసాగర్ (1944)

జననం : మెట్టుపల్లి, పరకాల

నివాసం : వరంగల్లు

తీరనికలలు, నవరాగిణి

72) గన్నుకృష్ణమూర్తి (1945)

జననం : నెక్కొండ, వరంగల్లు

ప్రస్తుత నివాసం : నిజామాబాదు

అడవి పూలు (1978), కవితా కాళింది (1980), అంతరంగం (1983), ఏక్ లహర్ సాగర్ కీ (1984) హింది

73) జీడికంటి శ్రీనివాసమూర్తి (1945)
జననం : పెగడపల్లి, వరంగల్లు
నివాసం : మచ్ఛాపూర్
పోతన మాధురి (1982)

74) కందాడై నిరంజన్ (1945)
జననం : రాజులకొత్తపల్లి, మహబూబాబాదు, వరంగల్లు
నివాసం : రెడ్డికాలనీ, హన్మకొండ
స్వేచ్ఛా గానము (1984)

75) బండి లక్ష్మీనరసింహారెడ్డి (1946)
జననం & నివాసం: గుండ్రాతిమర్గు, మహబూబాబాదు
భువననాదం (1981)

76) రామానుజపురం జియ్యర్‌స్వామి (1946) †
జననం : మాలిపురం, సూర్యాపేట, నల్లగొండ
స్థిరనివాసం : ఖిలాషాపురం, జనగామ, వరంగల్లు
కంటిపొర, ప్రాయశ్చిత్తం (నాటికలు), సర్వాయి పాపడు నవల, తలత్రిప్పితే ఎగిరిపోతుంది డిటెక్టివ్, జై ఇందిరా దండకం, ప్రియ దర్శిని దండకం

77) గుముడవెల్లి పురుషోత్తం (1947)
జననం : మొగిలిచర్ల, వరంగల్లు
నివాసం : వరంగల్లు
ప్రజారాజ్యం కవితా సంకలనం (1975)

† ఇతర వివరములకు శ్రీ లింగంపల్లి రామచంద్రగారి "జనగామ మండల రచయితలు- కవులు" వ్యాసం చూడండి

78) బేరే లక్ష్మీనారాయణ (1947)

జననం : ఎలుకుర్తి, వరంగల్లు

నివాసం : గిర్మాజీపేట, వరంగల్లు

అల్లూరి సీతారామరాజు (1983), దానవీర శూరకర్ణ (1984) బుర్రకథలు

79) రామా చంద్రమౌళి (1948)

జననం & నివాసం : గిర్మాజీపేట, వరంగల్లు

దీపశిఖ, శిలలు వికసిస్తున్నాయి, స్మరరేఖ (1986) కవితాసంపుటాలు, తెగిన చుక్కలు (కథల సంపుటి), అమృతం తాగిన రాక్షసులు, మంచుకాలింది, శాపగ్రస్తులు, చదరంగంలో మనుషులు, చూరు నీళ్ళలో ప్రవాహం, మజిలీ, దారితప్పిన మనుషులు, శాంతివనం, కాంతికెరటాలు, వక్రరేఖలు, తెలిసిచేసిన తప్పు, ఎడారిలో చంద్రుడు మొదలగు నవలలు

80) నల్ల ఉపేందర్ (1948)

జననం : గంగాపురం, నర్సంపేట

నివాసం : శివనగర్, వరంగల్లు

ప్రబంధ గణపతి, జలప్రళయం, శ్రీగట్టు మల్లన్న క్షేత్రమహాత్యం

81) జయధీర్ తిరుమలరావు (1948)

జననం : హన్మకొండ

ప్రస్తుత నివాసం : హైదాబాదు

అసలుపేరు : రేబల్లె తిరుమలరావు

అరణ్య నేత్రం (1980), మినీకవితలు, ప్రతిధ్వనులు, తెలంగాణా ఉద్యమం- కవిత

82) కనుకుంట్ల చక్రపాణి (1948)

జననం : రేపాక, పరకాల

నివాసం : రెడ్డికాలనీ, హన్మకొండ

ప్రళయ ఘోష (1082), స్మరరేఖ హింది (1984)

83) బి. దామోదరరావు (1949)

జననం : సిరిసిల్ల, కరీంనగర్

నివాసం : హన్మకొండ

కలం పేరు : "కామోదకి"

నా సమత కవిత (1981), జానపద సామెతలు (1985)

84) అనుమాండ్ల భూమయ్య (1949)

జననం : వెదురుగట్టు, కరీంనగర్ జిల్లా

నివాసం : విద్యారణ్యపురి, హన్మకొండ

కొరవి గోపరాజు (1981), నాయని సుబ్బారావు కృతులు- పరిశీలన (1983), వేయి పడగలు- ఆధునిక ఇతిహాసం (1984)

85) తక్కళ్ళ బాలరాజు (1949)

జననం & స్థిరనివాసం : ఏనుగులగడ్డ. హన్మకొండ

వెలుగు రేఖలు (కవితా సంపుటి), స్వాతంత్ర్య వీరులు, నవతరానికి నాంది (నాటిక) 1982, మరో పొద్దు పొడుపు (నాటిక) 1983, వ్యాసాంజలి (1984), చైతన్య పథంలోకి (నాటిక) 1986

86) మామిడాల రాములు (1950)

జననం : తరిగొప్పుల, జనగామ, వరంగల్

ప్రస్తుత నివాసం : మిచిగాన్ యూనివర్సిటి, అమెరికా

కాలం కదలికలు కవితా సంపుటి (1981)

87) టి. శ్రీరంగస్వామి (1950) †

జననం : పర్లపల్లి, కరీంనగరం జిల్లా
స్థిరనివాసం : విద్యారణ్యపురి, హన్మకొండ, వరంగల్లు
కలం పేర్లు : ఉషాకాంత్, శ్రీరస, సుధామ, యస్.

మధుర (84), శిఖరం (86), కవితా సంపుటాలు, విపంచి (1986) వ్యాస సంపుటి, చైతన్య (80), ప్రభవ (87). కవితా సంకలనాల సంపాదకత్వం, నబారా కవితా దర్పణం వ్యాస సంపుటి (1986) సంపాదకత్వం

88) తిరుకోవలూరి శశిరేఖ (1950)

జననం : కడిపికొండ
నివాసం : మడికొండ

కులానికి సమాధి నవల (1976)

89) తెన్నేటి సుధాదేవి (1950)

జననం : హన్మకొండ
నివాసం : హైదాబ్రాదు

వినిపించని వేదన (కథల సంపుటి), రవళి (కథల సంపుటి), ఉదయ కాంత (కవితా సంపుటి), సామెత (నాటికలు)

90) నమిలికొండ బాలకిషన్‌రావు (1950) ‡

జననం : పూడూరు, కరీంనగరం
నివాసం : రాగన్నదర్వాజ, హన్మకొండ
కలం పేర్లు : యన్, నబారా

యువస్వరం (కవితా సంపుటి) 1980, అక్షర చిత్రాలు 1987

† ప్రసారిక సాహిత్య పత్రిక స్థాపక గౌరవ సంపాదకులు
‡ ప్రసారిక సాహిత్య పత్రిక సంపాదకులు

91) పానుగంటి అమరేశ్వర్ (1951)

జననం : జడ్చర్ల, మహబూబ్‌నగర్

నివాసం : విద్యారణ్యపురి, వరంగల్

జీవనరాగంలో అనుభవ స్వరాలు (1982)

92) బిరుదురాజు రుక్మిణి (1952)

జననం & నివాసం ; నయీంనగర్, హన్మకొండ

నన్నయ భారతంలో ఉపమాలంకారము (1985)

93) కాత్యాయినీ విద్మహే (1955)

జననం & నివాసం : హన్మకొండ, వరంగల్లు

† రాబందులూ- రామచిలుకలు నవలపై సమీక్ష (1981)
రాయప్రోలు సుబ్బారావు వాఙ్మయ జీవిత సూచిక (1982)
బుచ్చిబాబు వాఙ్మయ సూచిక (1983)
కొడవటిగంటి కుటుంబరావు వాఙ్మయ జీవిత సూచిక (1986)
తెలంగాణా పోరాటం-కథ, నవల (1986)

94) వల్లంపట్ల నాగేశ్వరరావు (1955)

జననం : బెల్లంపల్లి, పరకాల, వరంగల్

నివాసం : కేసముద్రం

కుంకుమేశ్వర భజన గీతాలు (1969), తెలంగాణా ప్రజా జ్వాలలు (1972), రాజరాజేశ్వర స్తోత్ర రత్నాకరం (1975), వల్లంపట్ల పల్లె పాటలు (1978), మానవతా గీతాలు (1982), రాతిబొమ్మ నాటిక (1983), ఎలచ్చన్లచ్చినయ్ నాటిక (1987)

† శ్రీమతి శోభతోగారి కలసి ప్రచురించారు

95) జి. దామోదర్ (1957)

జననం : ఇప్పగూడెం, జనగామ

నివాసం : హన్మకొండ

దటు జెంటిల్ మెన్ ఆఫ్ వెరోనా (తెలుగు అనువాదం) (1982, 87)
ఇంగ్లీషుభాషకు చెందిన 5, 6 పుస్తకాలు వెలువరించారు

96) బండి శశికళ (1957-1982)

జననం : కొత్తూరు, హన్మకొండ

వెన్నెల పూలు కవితా సంపుటి (1983)

97) కేశబోయిన కాశీనాథ్ (1958)

జననం & నివాసం : వడ్డేపల్లి, వరంగల్లు

విశ్వయాగం కవితా సంపుటి (1984)

98) అనిశెట్టి రజిత (1958)

జననం & నివాసం : కుమార్ పల్లి, హనుమకొండ

గులాబీలు జ్వలిస్తున్నాయి (1984)

99) నిధి (1959)

జననం : శనిగరం, నర్సంపేట

అసలు పేరు : మారేడుకొండ బ్రహ్మాచారి

స్పందన కవితా సంపుటి (1980), పదును కవితా సంపుటి (1987)

100) భండారు విజయ (1960)

జననం & నివాసం : శివనగర్, వరంగల్

దీపిక కవితా సంపుటి (1984)

101) రావుల సుదర్శన్ (1962)

జననం & నివాసం : మచిలీబజారు, హనుమకొండ

స్త్రీ జీవితాలు నవల (1983)

102) రాహోలు సత్యనారాయణ (1964)

జననం & నివాసం : పాలకుర్తి, వరంగల్

ఢమరుక లయ శతకం (1985)

103) రాహోలు ఆనంద భాస్కర్ (1964)

జననం : కొడకండ్ల

నివాసం : హైదాబాదు

ఆగస్టు సంక్షోభం (1985), ఇందిరాగాంధి (1985)

104) యేలే బాలరాజు (1964)

జననం & నివాసం : జనగామ

కవితా కిరణాలు కవితా సంపుటి (1985)

105) వక్కంతుల అప్పారావు (1964)

జననం : ఉయ్యాలవాడ, డోర్నకల్లు, వరంగల్

నివాసం : డోర్నకల్లు

మానస సరోవరం కవితా సంపుటి (1985)

106) కుమారి వాసవి సుధాకర్ (1972)

జననం : మడికొండ

ప్రస్తుత నివాసం : హైదాబాదు

డ్రీమ్ ఆర్ రియాలిటీ (కవితా సంపుటి) ఆంగ్లం (1984)

# అనుబంధం 1.

## 6

ఈ అనుబంధంలో పేర్కొనిన రచయితల జనన సంవత్సరములు, సమగ్ర సమాచారం లభ్యం కానందున వీరందరిని ఒకచోట చేర్చడం జరిగింది.

1) ముదిగొండ శంకరశాస్త్రి

బట్టల బజారు, వరంగల్లు

శంకర శతకము, జాతీయ ప్రగతి గీతములు, శివజ్ఞాన చింతామణి, శివకిరణములు (రెండు భాగాలు), గణపతి, దీపావళి, శాంభవి శతకము, నలచక్రవర్తి (నాటకం), మైథున రాముడు (ఏకాంకిక) ముక్తావళి, లీలావతార తాత్పర్యం, శివభజన గేయాలు

2) పొడిశెట్టి దామోదరరావు

రాగన్నదర్వాజ, హనుమకొండ

జ్ఞానయోగత, ఆరోగ్య సాధనం, మానవ ధర్మాలు

3) బురార్రి నరసయ్య

జననం & నివాసం : నందనం, వరంగల్

గాంధి మహాత్మునిపై శతకం, స్వాతంత్ర్య సమరయోధా జోహార్లు

4) కుసుంబ లింగయ్య

రేపల్లె, నర్సంపేట

ఆరె- తెలుగు నిఘంటువు

5) జి. వై. గిరి

జననం : వడ్లకొండ, జనగామ, వరంగల్

నివాసం : ఆలేరు

అక్షరం (1980), కాంతి పాటలు

6) రేచర్ల లక్ష్మీనారాయణ

మచిలీబజారు, హనుమకొండ

పుష్పాంజలి (1966)

7) యం. సుబ్బారావు

జననం : రేపల్లె, (గుంటూరు)

నివాసం : ఖానాపురం, నర్సంపేట, వరంగల్

కలం పేరు : యమ్మెస్సార్

మాతృమందిరం (నవలిక), నవభారతం కవితా సంపుటి (1986)

8) శ్రీభాష్యం శ్రీనివాసాచార్యులు

ఖిలాషాపురం, జనగామ

శ్రీనివాస శతకము

9) కె. రాంమోహనరాజు

గిర్మాజిపేట, వరంగల్

రోడ్డుమీది సూర్యుడు (కవితల సంపుటి), అనామకుడి డైరీ (కథలు)
వసంత మేఘం (కావ్యం)

10) మల్లారెడ్డి

నల్లబెల్లి, ములుగు

రామప్ప గుడి గైడ్ (1986)

11) యం. వి. తిరుపతయ్య (1940)

జననం : ధర్మారం, కరీంనగరం

ప్రస్తుత నివాసం : హనుమకొండ

బతుకు నవల (చతుర మే 87)

12) సింగంభట్టు నరసింహరాజు

ధూళిమిట్ట, చేర్యాల, వరంగల్

శ్రీ యాదగిరీశ స్తోత్ర రత్నమాల

13) విజయార్కె ‡

వరంగల్

రుధిరాశ్రువులు (నవల)

---

‡ శక్తి బిందు వారపత్రికలో ధారావాహిక సీరియల్



"కవితల్ వ్రాయుట దొడ్డయన్ దలపులే గా, దర్థమార్జింప గా
దు, విశేషంబగు కీర్తి కాసపడి యెందున్ గోరలేదింత, శై
శవ మందిన్ గానలేత్తి జిత్తమున కాంక్షల్- గానరాదు హే
తవు- నీవే కలిగించినావని తలంతున్, గోపికా వల్లభా !"

—గార్లపాటి రాఘవరెడ్డి

# అనుబంధం 2.

7

త్రమ రచనలు పుస్తక రూపములో రాకుండా కేవలం పత్రికల్లో రచనలకు మాత్రమే పరిమితంగా ఉండిపోయినవారు చాలామందిఉన్నారు, అలాగే దూర ప్రాంతంలో ఉండి సాహిత్య సేవ చేస్తున్నవారు కూడా ఉన్నారు. అలాగే సంకలనాలకు సంపాదకత్వం బాధ్యత వహించి ముందుకు తెచ్చిన వారుకూడా ఉన్నారు. వరంగల్ జిల్లాకు చెంది ఇతర ప్రాంతాలలో స్థిరపడినవారు కూడా ఈ అనుబంధంలో చోటు చేసుకున్నారు.

1) వానమామలై వరదాచార్యులు (1912-1985)

జననం : మడికొండ

స్థిర నివాసం : చెన్నూరు, ఆదిలాబాదు

పోతన చరిత్రము, జయధ్వజము, విప్రలబ్ధ మణిమాల, ఆహ్వానము, విరిగినకొమ్మ (వచనకవితా సంపుటి), వైశాలినీ పరిణయం, రాజ్యశ్రీ పగటికలలు (నాటికలు), ప్రజాసేవ, రైతులక్ష్మి (బుర్రకథలు)

2) వానమామలై జగన్నాథాచార్యులు

జననం : మడికొండ

స్థిర నివాసం : పోతురెడ్డిపేట, హుజూరాబాదు, కరీంనగరం

రైతు రామాయణం

3) దాశరథి

జననం : గూడూరు, మహబూబాబాదు

నివాసం : హైదరాబాదు

అగ్నిధార, రుద్రవీణ, మహాంధ్రోదయం, పునర్నవం, మహాబోధి, నవమి, నవమంజరి, అమృతాభిషేకం, గాలిబ్ గీతాలు, దాశరథి శతకము, కవితా పుష్పకం, తిమిరంతో సమరం, ఆలోచనాలోచనాలు, ధ్వజమెత్తిన ప్రజ, జ్వాలాలేఖిని

4) దాశరథి రంగాచార్యులు

జననం : గూడూరు, మహబూబాబాదు

నివాసం : హైదరాబాదు

మోదుగు పూలు, చిల్లర దేవుళ్ళు, మాయజలతారు, జనపదం

5) సి. రాఘవాచారి

జననం : శాతాపురం, జనగామ

నివాసం : విజయవాడ

విశాలాంధ్ర దినపత్రికలో ఉద్యోగం

6) నల్లబెల్లి రంగయ్య (1923)

జననం : తాటికొండ, ఘనపురం మండలం

నివాసం : రెడ్డికాలని, హనుమకొండ

ఆంధ్ర పత్రిక, జ్యోతి, ఉదయంలలో పలు వ్యాసాలు (దాదాపుగా 750)

7) పెండ్యాల చినరాఘవరావు (1934)

జననం : చినపెండ్యాల, ఘనపురం మండలం

నివాసం : హనుమకొండ

8) టంకసాల అశోక్
జననం ; ఖిలా వరంగల్లు
నివాసం : న్యూ ఢిల్లీ

9 దేవులపల్లి సుదర్శన్‌రావు
జననం : బొల్లికుంట
నివాసం : హనుమకొండ

10) సమ్మెట గోవర్ధన్
జననం : కుమార్‌పల్లి, హనుమకొండ
వృక్ష జంతు శాస్త్రాలపై పలు వ్యాసాలు 100 కు పైగా

11) లింగంపల్లి రామచంద్ర (1945)
జననం : వెల్ది జనగామ
నివాసం : ఆలేరు
జనగామా తాలూకా మండల చరిత్ర గురించి పలు వ్యాసాలు

12) "రుక్మిణి"
జననం : డోర్నకల్లు
నివాసం : వరంగల్
అసలు పేరు : రాంరెడ్డి
కథలు, కార్టూన్లు

13) యం. వరదాచార్యులు (1941)
జననం & నివాసం : నర్సంపేట వరంగల్
సవిత రెండు భాగాలు, దర్పణం (1987) కవితా సంకలనాల సంకలన కర్త

14) **పి. యన్. స్వామి (1933-1986)**

జననం : హనుమకొండ

కలం పేరు : జ్వాల

కాకతీయ వారపత్రిక, ఆంధ్రపత్రికలలో వ్యాసాలు

15) **చౌడవరపు విశ్వనాథం**

జననం & నివాసం : గూడూరు, పాలకుర్తి మండలం

కలం పేరు : రుక్మిణీపతి

వెలుగు పత్రిక సంపాదకులు

ఉషాపరిణయం నాటికను కీ॥ శే॥ ఆర్తినమ్మాళ్వరయ్యగారితో కలసి రచించారు

16) **దేవులపల్లి అమర్ & ప్రభాకర్**

జననం : వరంగల్

నివాసం : హైదాబాదు

17) **గంగుల బుచ్చిరెడ్డి**

జననం : రాఘవాపురం, ఘనపురం మండలం

కొత్తచిగుళ్ళు కవితా సంకలనం సంపాదకత్వం

18) **కలువాల మనోహరరావు**

జననం : హనుమకొండ

కొత్తచిగుళ్ళు కవితా సంకలనం సంపాదకత్వం (1965)

19) **కుంటపల్లి ప్రభాకర్ (1938-1983)**

జననం : చింతలపల్లి, వరంగల్

20) గట్ల రాంరెడ్డి
జననం : వరంగల్
నాటక ప్రక్రియలపై వ్యాసాలు రాసారు

21) లోచన్
జననం : హనుమకొండ
అసలు పేరు : గంగాధర రాజలోచన్
వీరి కవిత "ట్రిగ్గర్‌పై వేళ్ళతో" అనేది ప్రఖ్యాతం, తిరుగబడు, కొత్తచిగుళ్ళు, బంగ్లాదేశ్, సమరగీతి సంకలనాలలో వీరి కవితలు

22) అగ్నిమిత్ర
జననం : వరంగల్
నివాసం : ఖమ్మం
అసలు పేరు : పుల్లయ్య

23) వే. నరసింహారెడ్డి (వే న రెడ్డి) (1940–1973)
జననం : పల్లగుట్ట, వరంగల్
సమరగీతి, సమర్ పథే బంగ్లా, సవిత కవితా సంకలనాల సంపాదకత్వం, చేతనా వర్త కవులలో ఒకరు

24) ముదిగొండ వీరభద్రయ్య
జననం : వరంగల్
నివాసం : నల్లగొండ
ప్రస్తుతం : నిజామాబాదులో

25) కొండబత్తిని జగదీశ్వరరావు (1924)
జననం : వరంగల్, రామన్నపేట
వరంగల్ దర్శిని సంపాదకత్వం

26) వద్దిరాజు రంగారావు (1943)

జననం & నివాసం : బ్రాహ్మణవీధి, హనుమకొండ

కలం పేరు : సంధ్యా రంగారావు

ఆంధ్రప్రభ దినపత్రికలో కొంతకాలం శీర్షిక నిర్వహించారు

27) నెల్లుట్ల కోదండ రామారావు

జననం : కూనూరు, జఫర్‌గడ్ మండలం

నివాసం : హనుమకొండ

కలం పేరు : ఎన్. కె.

లాల్‌బనో, బంగ్లాదేశ్ సంకలనాల సంకలన కర్త

28) ఏడునూతుల ముత్తయ్య †

జననం : ఏడునూతుల, కొడకండ్ల మండలం

"అన్యవాద కోలాహలము" ఏకామ్రిడుగాని, ఏకామ్రగురువు విరచితము- దీని ప్రచురణకర్త ముత్తయ్యగారు

29) మురళీధర్

జననం : హనుమకొండ

తృణకోణాలు, లోవెలుగులు కవితా సంకనాల సంకలన కర్త

30) అష్టకాల నరసింహ రామశర్మ (1943)

జననం : బచ్చన్నపేట (జనగామ)

నివాసం : రాజగోపాలపేట, మెదక్

శిథిలవిపంచి (1969), శ్రీరామచంద్రిక (1976), అఖండానంద

† ఏడునూతుల గ్రామం అనే ఊహ వావిళ్ళవారు 1949 లో ముద్రించినారు.

సరస్వతీపూజ, సరస్వతి స్తుతి కల్పకం (1982): వీరు నూటికిపైగా అష్టావధానాలు చేసారు

31) గన్ను సుదర్శన్ రావు (1926-46)

జననం : నెక్కొండ

మామపెండ్లాం (నాటిక), బాటసారి (నవల)

32) ఆర్. సుధాకర్ రావు (1946)

జననం : రామన్నపేట, వరంగల్

ప్రస్తుత నివాసం : మంచిర్యాల, ఆదిలాబాదు

ది అన్ వాన్‌క్విష్‌డ్ ఆంగ్ల నవల (1983)

33) పి. వి. మనోహర్ రావు

జననం : వంగర (కరీంనగర్)

నివాసం : హనుమకొండ

కైలాస శిఖర దర్శనం (1986)

34) పల్లేరు వీరస్వామి

జననం & నివాసం : పరకాల

ఉషోదయం- కవితా సంకలనం సంకలన కర్త

35) న. చ. రఘునాధాచార్యులు

జననం : వరంగల్

సంస్కృత పండితులు

36) హొదిల శ్రీరామమూర్తి (1944)

జననం : అమరావతి (గుంటూరు)

నివాసం : హనుమకొండ

ఓ రామారావుకథ, చీకట్లో కలిసిన దీపం (కథల సంపుటి) 1981, అంతర్యానికి ఆవలివైపు (నవల) 1983

37) వి. వీరాచారి (1959) †

జననం : మహబూబ్‌నగర్

పసిడి మొగ్గలు కవితా సంకలనం

38) తోట వెంకటేశ్వరరావు (1962) †

జననం : నల్లగొండ

పసిడి మొగ్గలు కవితా సంకలనం

39) తాండవ కృష్ణ

జననం : జనగామ

40, సుధాకర్

జననం : వడ్డెపల్లి

కొక్కొరోకో (కవితా సంకలనం- సంపాదకత్వం)

41) యస్. యన్. చారి

జననం : హనుమకొండ

42) వరిగొండ కాంతారావు

జననం & నివాసం : హనుమకొండ

పలు కథలు- కవితలు

† పసిడి మొగ్గలు కవితా సంకలనం కర్తలు

43) యం. ఏ. హకీం

జననం : నయీంనగర్, హనుమకొండ

కన్నీటి సాగరంలో మునుగుతున్న భారతం (ఇందిరాగాంధి స్మృతికి)

44) గొట్టుముక్కల శ్రీనివాసరావు

జననం & నివాసం : హన్మకొండ

45) యస్. పి. రాజేశ్వరరావు

జననం & నివాసం : వరంగల్

46) యం. శ్రీధర్ (వరంగల్ వాణి)

జననం & నివాసం : వరంగల్

47) నెల్లుట్ల రమాదేవి

జననం & నివాసం : ఘనపురం మండలం వరంగల్

కథలు- కార్టూన్లు

48) డా॥ రామక లక్ష్మణమూర్తి

జననం : హుస్నాబాదు, కరీంనగరం

నివాసం : రామ్‌నగర్, హనుమకొండ

హనుమాన్ చాలీసాకు విపుల వ్యాఖ్యానం

శ్రీ మహిమ్నస్తోత్రం † పై తెలుగులో వ్యాఖ్యానం

49) శ్రీ పెరుంబూదూరు లక్ష్మణమూర్తి

జననం : చందుపట్ల, నల్లగొండ

నివాసం : విద్యారణ్యపురి, వరంగల్

† శ్రీ పెరుంబూదూరు లక్ష్మణమూర్తిగారితో కలిసి హనుమత్సేవ పత్రికలో వ్రాసారు

50) పెండ్యాల బుచ్చికృష్ణదాసు

జననం & నివాసం: మండిబజారు, వరంగల్

భజన గీతాలు

51) మేర్గు నారాయణ

జననం & నివాసం: రైల్వేగేటు, వరంగల్

అచలవేదాంత అభ్యుదయ భజన మాల

52) చూడ దేవమాంబ

జననం & నివాసం: శివనగర్. వరంగల్.

అచలవేదాంత భజన గీతాలు

53) రేవా కోటేశ్వరరావు

జననం & నివాసం: మట్టెవాడ, వరంగల్

54) యస్. యల్. నర్సింహాచార్యులు

జననం & నివాసం: స్టేషన్‌రోడ్, వరంగల్

55) వెలగడప చండికేశ్వరశర్మ

జననం & నివాసం: చల్వాయి, ములుగు, వరంగల్



"సమాజ వికాసానికి
ప్రతి బింబం కవిత"

—టి. శ్రీరంగస్వామి

# 8

వరంగల్లు జిల్లా సాహిత్య చరిత్రను పరిశీలించినప్పుడు ఇక్కడి గ్రంధాలలో సాహిత్య గ్రంథాలే కాకుండా, గణిత రహస్య గ్రంథాలు, నాట్యశాస్త్ర గ్రంథాలు, ఆధ్యాత్మిక గ్రంధాలు, చరిత్ర గ్రంధాలు మొదలగు పలురకాల ప్రక్రియలకు సంబంధించిన గ్రంధాలు ఎన్నో మనకు కనబడుతున్నవి. ప్రక్రియా పరంగా మనం వీటిని పరిశీలించి పరిశోధనకు ముందుకు సాగిస్తే ఇంకా ఎంతో కుతూహలమైన సమాచారాన్ని వెలికి తీయడమే కాకుండా వరంగల్లులోని సాహితి, సాంస్కృతిక పరమైన వివరాలను వివరంగా అందించడానికి ఎంతైనా అవకాశముంటుంది. భావి పరిశోధకులు ముందు, ముందు దానిని దృష్టిలో పెట్టుకొని ఉపక్రమించడం ఎంతైనా అవసరం.

వరంగల్లులోని సాహితీ చరిత్రను సంఘటీతం చేయదలచుకున్నప్పుడు, రచయితలు ముందు, ముందుగా తమ గ్రంధాలను ఒక కేంద్రంగా ఏర్పరచుకొని ఒకచోట భద్రపరచుకొనడం బాగుంటుంది. అంతేకాకుండా ఎవరైనా ముందుకువచ్చి వీటిని భద్రపరచడానికి సహాయం అందించాలి. వరంగల్లు జిల్లాలోని తెలుగు సమాచార కేంద్రంవారు కనీసం ఈ లోటును పూర్తి చేస్తారని ఆశిస్తూ, వారు ఏ విషయాన్ని అయినా సమగ్రంగా అందించడానికి ముందుకు పూనుకొని తయారుగా ఉండాలి. ఇందుకు ఒక వ్యక్తిని కేటాయించి వివరాలు సేకరించి భద్రపరచాలి అని కోరుతున్నాను. దానివలన భవిష్యత్తులో ఎందరికో ఉపయోగం ఉంటుంది. అంతేకాకుండా పరిశోధకులకు ఉపయోగకరముగా కూడా ఉంటుంది ఈ సమాచార కేంద్రం.

జిల్లా కేంద్ర గ్రంథాలయాలలో ఆ జిల్లాకు సంబంధించి ఒక ప్రత్యేక విభాగమును ఏర్పరచి, అందులో ఆ జిల్లాకు సంబంధించిన గ్రంధా

లను ఉంచినచో అందరికీ ఉపయోగకరముగా ఉంటుంది. అంతేకాకుండా స్థానికుల గ్రంథాలను జిల్లా గ్రంథాలయాధికారులు స్వచ్ఛందంగా కొనడానికి నిబంధనలను సడలించాలి. దీనివలన సమాచారం ఒకేచోట లభ్యపడడము నకు అవకాశం ఉంటుంది. ఈ సూచనను ఆ యా సంబంధిత అధికారుల పరిశీలనకు తీసుకొని ఆలోచించగలరని కోరుచున్నాను. ఇదే విషయంను విశ్వవిద్యాలయాలు కూడా పరిశీలిస్తే బాగుంటుంది.



“ఆశలపై ఆశలు పెంచుకొనేవాడు ఎప్పుడూ తనకుతాను
భారము కావడమే కాక, లోకానికి భారంగా పరిణమించే ప్రమాదముంది
తనను సంకెపం చేసుకొని నామ మాత్రంగా
నిలపకలిగిన వాడే ఇతరుల దుఃఖ భారాన్ని
మోయగల దయాశీలుడు కాగలుగుతాడు”

—పొట్లపల్లి రామారావు

# 9

## ఉపసంహారము:—

నాటికీ, నేటికీ వరంగల్లు కేంద్రంగా సాగిన సాహిత్య కృషిలో ఇక్కడ పేర్కొన్నవారు కొందరు మాత్రమేనని అనుకొంటున్నాను. జ్ఞాతంగానూ, అజ్ఞాతంగానూ ఇంకా ఎందరో ఉన్నారు. దీనికి ఇంకా పరిశ్రమ అవసరంగానే మిలిగిపోతుంది, సమయంకూడా పడుతుంది, ఇప్పటికే ఇది **5, 6** సంవత్సరాల కృషి. వరంగల్లులో విశ్వవిద్యాలయం, ఇతర సంస్థల కారణంగా ఇక్కడికివచ్చి, ఇక్కడే ఉండి సాహిత్య కృషి చేస్తున్న, కృషికి దోహదం చేస్తున్న కవి, పండిత, రచయితలు పలువురు—

ఈ సూచికలో చోటు చేసుకొనిన రచయితల వివరాలను సహృదయంతో అందిస్తే మలి ముద్రణలో సరిదిద్దుకోగలను. ఎవరినైనా వదిలేసి ఉంటే వారి వివరాలు అందక, వారివారి సంబంధీకులు అందించక పోవడం వలననే తప్ప మరొకటి కాదని మనవి చేస్తున్నాను.

జిల్లా స్థాయిలో ఆ యా జిల్లాల రచయితల చరిత్ర వెలికి తీసే ప్రయత్నం జరిగినట్టుగా తెలుస్తున్నది. అనంతపురం జిల్లా, కరీంనగరం జిల్లా, మెదకు జిల్లాల రచయితల వివరాలను బహిర్గతం చేయడానికి కృషి జరిగి అవి పుస్తక రూపములో వచ్చాయి. కేంద్ర సాహిత్య అకాడమీవారు చాలా సంవత్సరాల క్రితం "Who is who of Indian Writers" అనే గ్రంథం వేసినారు. అలాగే ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర స్థాయిలో శ్రీ పోతుకూచి సాంబశివరావుగారు అఖిల భారత తెలుగు రచయితల ప్రథమ మహాసభలు **1960** లో నిర్వహించిన సందర్భంగా, శ్రీ వేలూరి సహజానందగారి సంపాదకత్వంలో తెలుగు రచయితలను Who is Who గా ప్రచురించారు.

రాష్ట్ర స్థాయిగా, జాతీయ స్థాయిగా ఒక అంచనా వేయడానికి జిల్లాలవారిగా వచ్చే ఈ చరిత్రలు కొంతైనా ఆ అవసరమును తీర్చగలుగుతాయి అని నా నమ్మకం కాల ప్రవాహంలో కలిసిపోయే జీవనవాహినిలో ఇవి కాలనాళికలు అయి ఆ ప్రాంత సాహిత్య చరిత్రను కొంతైనా ప్రభావితం చేస్తాయి. మన సాహిత్య బీజాలను, వాటి గాఢతను ప్రస్ఫుటింప చేస్తాయి. అయితే ఇది దానికి ఒక ''రేఖా చిత్రం'' మాత్రమే.

ఈ రేఖా చిత్రం భావి చరిత్రకారులకు స్ఫూర్తిని, స్పందనను కలుగ చేస్తుందని ఆశించడంలో ఏ మాత్రం తప్పులేదని అనుకుంటున్నాను.



తలచి తరచి తలపులన్ని
పలుకుల్లో ఒలికిస్తే
ప్రాణాలే ఝల్లుమనును
గుండెమువ్వ ఘల్లుమనును

—కాళోజి

# 10

## ఉపయుక్త గ్రంథాలు:—

గ్రంథాలు :—

1) సమగ్ర ఆంధ్ర సాహిత్య చరిత్ర
3 వ భాగము ఆరుద్ర

2) సారస్వత నవనీతము
దేవులపల్లి రామానుజరావు

3) హైదాబాదు నగర తెలుగు భాషా
సాహిత్య వికాస చరిత్ర
డా॥ ఓగేటి అచ్యుతరామశాస్త్రి

4) శ్రీ సీతారామాంజనేయ సంవాద కావ్యము,
ఒక సమాలోచనాత్మక పరిశీలన,
రాజయోగ దర్శనము
డా॥ రత్నాకరబాలరాజు (అనంతపురం)

5) ఆంధ్ర శతక సాహిత్య వికాసము
డా॥ కే. గోపాలకృష్ణరావు

6) మన కవులు, పండితులు, రచయితలు
శ్రీ కోవెల సంపత్కుమారాచార్యులు

7) ఆంధ్ర వాఙ్మయ చరిత్ర
దివాకర్ల వెంకటావధాని

ప్రత్యేక సంచికలు :—

8) మాడపాటి హనుమంతరావుగారి
షష్ఠిపూర్తి సంచిక

9) అక్షర దీపం
(దేవులపల్లి రామానుజరావుగారి షష్ఠిపూర్తి అభినందన గ్రంథము)
ప్రచురణ-
చైతన్య సాహితి సాంస్కృతిక సమాఖ్య హైద్రాబాదు

10) జాతీయ సాహిత్య పరిషత్
ప్రత్యేక సంచిక **1975**

11) "తెలుగు వాణి"
ప్రపంచ తెలుగు మహాసభల ప్రత్యేక సంచిక **1975**

12) ఆంధ్ర ప్రదేశ్-నవంబరు **1976**
ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర **20** వ వార్షికోత్సవ ప్రత్యేక సంచిక

13) వరంగల్ దర్శిని **1986**
సంపాదకుడు : శ్రీ కొండబత్తిని జగదీశ్వర్‌రావు

పత్రికలు :—

14) జనధర్మ వార పత్రిక

15) ప్రజామిత్ర వార పత్రిక

16) యువతరంగం వార పత్రిక

17) స్రవంతి మాసపత్రిక (హిందీ ప్రచారసభ, ఆం. ప్ర.)



# మరికొందరు..........

1) శాక్యలమల్ల మల్లికార్జునభట్టు
నిరోష్ఠ్య రామాయణము, ఉదార రాఘవము

2) గంగాధర కవి
భారత కథను గాటముగా రచించినారు.

3) నరసింహ కవి †
కాదంబర నాటకకర్త

4) విశ్వనాధుడు †
సౌగంధికాపహరణము రూపకము

5) వీరభల్లట దేశికుడు ‡
నాట్య శేఖరము

6) అప్పయార్యుడు
జినేంద్ర కళ్యాణాభ్యుదయం

7) నెల్లుట్ల వెంకటేశ్వరకవి

---

† వీరుఇరువురు గంగాధర కవియొక్క పుత్రులు- సౌగంధికాహరణము రూపకం "ఆకాంచనము, అరత్నమునై విద్వత్కర్ణ భూషణమని" విద్వాంసులచే విఖ్యాతి గన్నది.

‡ ప్రతాపరుద్రుని ఆస్థానపండితులలో శ్రేష్ఠుడు.

8) కీ॥ శే॥ శేషభట్టరు రామానుజాచార్యులు
అఖిల భారత తస్కర మహాసభ, ఆంధ్రనామ సంగ్రహము

9) విశ్వనాధ వేంకటేశ్వరశాస్త్రి

10) హరి రామలింగశాస్త్రి

11) మాచిరాజు దేవీప్రసాద్

12) దేవులపల్లి దామోదరరావు

13) శాంతి కృష్ణమూర్తి §
రకరకాల భార్యలు, రకరకాల భర్తలు మొదలగునవి.

14) కందుకూరి లింగరాజు

15) వేమూరి శ్రీనివాసమూర్తి (1938)
కాళ్ళకూరి నారాయణరావు- జీవితం, సాహిత్యం (1987)

16) తాళ్ళపల్లి యాదగిరిగౌడు
(ములుగు ఘణపురం)

ఆంధ్రప్రదేశ్ అవతరణ సంచిక (ప్రచురణ తెలంగాణా రచయితల సంఘం, వరంగల్ శాఖ (1-11-1956) సంపాదకవర్గం- కాళోజి నారాయణ రావు, పాములపర్తి సదాశివరావు, గార్లపాటి రాఘవరెడ్డి)లో శ్రీ చెలమచర్ల రంగాచార్యులుగారి వ్యాసం చూడుడు క్రమ సంఖ్య 1 నుండి 6 వరకు

క్రమ సంఖ్య 7 నుండి 14 వరకు
పై పుస్తకములోనే శ్రీ సుప్రసన్నగారి వ్యాసం

§ లష్కర్‌బజార్‌లోని ప్రభుత్వ ప్రాక్టీసింగ్ హైస్కూల్ (నార్మల్)లో నేను చదువుకున్నప్పుడు వీరు ఉపాధ్యాయులుగా ఉండేవారు.

# ప్రత్యేకానుబంధం - 3

## 11

# తెలుగు పత్రికారంగంలో వరంగల్లు జిల్లా

వరంగల్లు జిల్లా వ్యాపారానికెంత ప్రసిద్ధి చెందినదో కాకతీయ శిల్పకళకు ఎంత ప్రాశస్త్యం చెందినదో సాహిత్య వికాసానికి అంతే ప్రసిద్ధి నందినది. ఈ సాహిత్య వికాసానికి పత్రికలకు జీవగర్రలు. ఈ పత్రికద్వారా ఎంతో మంది రచయితలు వెలుగులోకి వచ్చారు, వస్తున్నారు. ఈ పత్రికలు వర్తమాన, భవిష్యత్ కాలాలకు వారధిలాంటివి. అంతేకాదు ప్రజలకు ప్రభుత్వం మధ్య అవగాహనకు సోపానాలు అని చెప్పటలో ఏమాత్రం అతిశయోక్తి లేదు. ప్రపంచం నలుమూలల, వార్తలు, సాహిత్యం ఈ పత్రికల ద్వారానే ప్రజలకు సన్నిహితం చేస్తాయి.

ప్రజా సంబంధాలకు దగ్గరయిన ఈ పత్రికా రంగంలో వరంగల్లు జిల్లానుండి వచ్చిన తెలుగు పత్రికల గురించి శోధించినప్పుడు నా దృష్టిలోకి వచ్చిన పత్రికల వివరాలకు, సంపాదకుల పేర్లను ఇక్కడ పొందు పరుస్తున్నాను.

| పత్రికలు | సంపాదకులు |
|---|---|
| 1) కాకతీయ దినపత్రిక | చాడవరపు రాజనరేంద్ర |
| 2) తెనుగు పత్రిక 1922-25 (ఇనుగుర్తి) | ఒద్దిరాజు సోదరులు |
| 3) పూలదోట మాస పత్రిక | కంభంపాటి అప్పన్నశాస్త్రి |

4) శోభ మాస పత్రిక 1947-48 & 50-51 — దేవులపల్లి రామానుజరావు
5) కాకతీయ వారపత్రిక 1945-52 — పాములపర్తి సదాశివరావు
6) వెలుగు 1952-55 (జనగామ) — చౌడవరపు విశ్వనాథం
1957-1960 (వరంగల్లు)
7) విశ్వసాహితి (పర్కాల) — కటంగూరు నరసింహారెడ్డి
8) గౌడ పత్రిక — కక్కెర్ల కాశీనాథం
9) విరాట్ (ప్రస్తుతం హైదాబాదు నుండి వస్తున్నది.) — వెంకటేశ్వరశాస్త్రి
10) ప్రగతి వారపత్రిక — భండారు చంద్రమౌళీశ్వరరావు
11) జనధర్మ వారపత్రిక — టి. వై. నరసింహాచార్య
12) సాధన మాస పత్రిక 1965 — భండారు సదాశివరావు
13) మానవధర్మ మాస పత్రిక 1950 — టి. లోకాచార్య
14) ధర్మభూమి వారపత్రిక — కె. చంద్రమౌళీశ్వరరావు
15) జనధర్మ వారపత్రిక 28-11-1958 — యం. యస్. ఆచార్య
16) జనధర్మ ద్వైవారపత్రిక 1976 — యం. యస్. ఆచార్య
17) జనధర్మ (ద్వైమాసిక సాహిత్యానుబంధం)
యం. యస్. ఆచార్య (కోవెల సుప్రసన్నాచార్యులు గౌరవ సంపాదకులు)
18) వరంగల్లువాణి దినపత్రిక (1980) — యం. యస్. ఆచార్య
19) జనధర్మ (ప్రస్తుతం వరంగల్‌వాణి అనుబంధ సంచిక)
20) ప్రజామిత్ర వారపత్రిక 1965 — దివ్వెల హనుమంతరావు
21) కవితా జ్యోతి 1964 (నవంబరు)
(చాతుర్మాసిక పత్రిక) — ఎ. వి. సత్యనారాయణరావు
22) గ్రామాభ్యుదయ త్రైమాస పత్రిక 1967 — కీర్తి రామనాథం
23) పరిశ్రమ పక్ష పత్రిక (తర్వాత వారపత్రిక) — మాచర్ల జగన్నాధం
24) ప్రతినిధి — యస్. మల్లేశం
25) సృజన మాస పత్రిక 1967 — పెండ్యాల వరవరరావు
26) ఏకశిల వారపత్రిక 1972 — బి. దేవయ్య
27) ఏకశిల దినపత్రిక 1983 — బి. దేవయ్య

28) ఆరోగ్యసాధనము మాసపత్రిక 1972 అక్టోబరు — చిలువేరు కృష్ణమూర్తి
29) ఓరుగల్లు వార పత్రిక 1974 — టి. రాజేశ్వరరావు
30) తెలుగు ధర్మ వార పత్రిక 1968 — దుగ్గిశెట్టి వెంకటయ్య
31) ప్రజాయుగం వార పత్రిక — ఎస్. పి. రాజేశ్వరరావు
32) దీపిక మాస పత్రిక — వై. విద్యాసాగర్
33) విమర్శిని వార్షిక సంచిక 1976-80 — కాకతీయ విశ్వవిద్యాలయం
34) కోరిక మాస పత్రిక 1981-82 — టి. భాస్కరాచార్య
35) ప్రసారిక మాస పత్రిక — నమిలికొండ బాలకిషన్‌రావు
36) అగ్రగామి వారపత్రిక 1982 (జనగామ) — కన్న పరశురాములు
37) విశ్వతరంగిణి మాస పత్రిక 1984 — శ్రీమతి కట్టా శశికళ
38) పల్లె జీవితం పక్ష పత్రిక (ఘనపురం స్టేషన్) — మారం శేఖరయ్య
39) చిత్ర విచిత్ర సినీ వార పత్రిక — రాజా (ఆదర్శ ప్రింటర్స్)
(తరువాత రాజకీయ పత్రికగా మారింది)
40) చిత్రగీతి — వరంగల్ ఫిలిం సొసైటీ
41) (పేరు తెలియదు) — కోకల సీతారామశర్మ
42) అదృష్టం జ్యోతిష మాస పత్రిక (1967-72) — మధుసూధనరావు
43) కార్మిక శక్తి 1967 — భండారు నాగభూషణరావు
44) తీర్పు వార పత్రిక 13-1-1986 (జనగామ) — విజయకుమార్
45) కాంగ్రెస్ వార పత్రిక 1952 — దేవులపల్లి సుదర్శన్
46) సోషలిజం 1975 — ఫరీద్ కైసర్
47) ఆంధ్ర టెలీవర్కర్ 1966 — యం. జనార్ధనం
48) వ్యాపార రంగం 1967 — జి. వి. రామకృష్ణరావు
49) ప్రాపర్ న్యూస్ (పరకాల) 1973 — కేలిక కిషన్ ప్రసాద్
50) తేజోమయ మాస పత్రిక 1971 — జి. వి యస్. ఆచార్య
51) దేవస్థానవాణి ,, 1968 — టి. వై. ఎన్. ఆచార్య
52) నాస్తికత్వం త్రైమాసిక 1965 — వెంపో
53) ఆంధ్రరాష్ట్రం 1967 — వి. రంగారావు

54) విమోచన పక్ష పత్రిక 1976 — పి. కిషన్‌రావు
55) మానుకోట వార్త — బి. ఎన్. గుప్త
56) వరంగల్ పత్రిక — కోమురయ్య
57) యువతరంగం 1980 — గుండా ప్రకాశరావు
58) పిచ్చి గీతలు మాస పత్రిక 1983 — కోలా స్వామి
(ప్రారంభ సంచిక అచ్చులోనె మరణించారు)
59) (పేరు తెలియదు) 1969 — మామిడి రమాకాంతరావు
60) శక్తిబిందు వారపత్రిక 1986 — దివ్వెల రామారావు
61) స్టేజి ఫ్రెండ్స్ (తెలుగు రంగస్థల మాస పత్రిక) 1986 — పడాల బిషపతి
62) సేవా ప్రపంచం పక్ష పత్రిక — దాసరి జనార్ధన్
63) వైశ్య కల్ప — శ్రీమతి ఉప్పల భారతి
) ప్రెస్ బులెటిన్ పక్ష తరంగిణి 1987 — సముద్రాల ఓంకార్

ఇక్కడ ఇస్తున్న విషయము సంపూర్ణము కాదు, సమగ్రముగాదు. యెందుకంటే నా ప్రయత్నములో వచ్చిన పత్రికలను మాత్రమే ఇక్కడ ఉదహరించడం జరిగింది.

ప్రజామిత్ర రిపబ్లిక్ డే ప్రత్యేక సంచిక (27-1-1986)లో ప్రచురణ.



12

# గ్రంథాలయోద్యమం – వరంగల్లు

"ఒకచోట గ్రంథాలయ నిర్మాణమంటే అచట అజ్ఞానం పటాపంచలై స్వాతంత్ర్య జ్యోతి వెలిగించడమన్న మాట"

విప్లవాలు, ఉద్యమాలు వెల్లువలై కట్టలనూ, గుట్టలనూ తెగ్రించుకొని వ్యాపిస్తుంటవి. కాని ప్రారంభదశలో వాటిమూల స్థానం ఏదో ఒక కొనసన ఉంటుంది. హైదారాబాదు స్వాతంత్ర్య పోరాటంలో వరంగల్లు జిల్లాకు, వరంగల్లు నగరానికి ఒక ప్రత్యేక విశిష్టత ఉన్నది.

గ్రంథాలయముల పుట్టుకకు, అభివృద్ధికి, విజ్ఞాన శాస్త్రముల అభివృద్ధి, అచ్చు యంత్రముల వ్యాప్తి చాలా సహాయపడినవి. అధిక సంఖ్యలో పుస్తకాల ఉత్పత్తికి అవకాశం ఏర్పడడంతో విద్యా ప్రియులైన జమీందారులు, పండితులు, భాషాభిమానులు గ్రంథములను సేకరించి గ్రంథాలయాలను నెలకొల్పినారు. అయితే ఇవి సార్వజనిక గ్రంథాలయాలుకావు. తెలుగునాటి మొదటి పౌర గ్రంథాలయం 1886 లో విశాఖ పట్నంనందు స్థాపించారని అనుకుంటున్నదశలో, ప్రఖ్యాత పరిశోధకుడు కీ॥ శే॥ శ్రీ బండి గోపాలరెడ్డి గారు రాజమండ్రిలో జడ్జిగా పనిచేసిన జేమ్స్ థామస్ రీడింగ్ రూమును 1839 సంవత్సరములో స్థాపించి నిర్వహించినట్లు తమ పరిశోధనలో వెల్లడించినారు. గ్రంథాలయాల ముఖ్య ఉద్దేశము మనభాషా సంస్కృతుల పరిరక్షణ. భవిష్యత్

సంతతుల ఉపయోగం నిమిత్తం గ్రంథాలయాలను నిక్షిప్తం చేయడం, వారి వారి ప్రత్యేక అవసరాల కనుగుణంగా సమాజంలోని ప్రతి వారూ ఉపయోగించుకొనడానికి అవకాశములు కల్పించడానికి, దేశవ్యాప్తంగా ఇవి ఏర్పడటానికి నిర్మాణాత్మకంగా చేయబడే ప్రయత్నమే గ్రంథాలయోద్యమమని సుప్రసిద్ధ గ్రంథాలయ శాస్త్రవేత్త, ''గ్రంథాలయ పితామహుడు'' డాక్టర్ యస్. ఆర్. రంగనాథన్‌గారు నిర్వచించినారు. అందుకే ''గ్రంథాలయాధికారి ఆఫీస్ అసిస్టెంట్ కాదు ! పుస్తకాలు భద్రపరిచే స్టోరు కీపరు కాదు !! గ్రంథాలయాధికారి ఒక బోధకుడు !!!'' అనే విషయం గ్రహించాలి.

తెలంగాణాలో జాతీయోద్యమం గ్రంథాలయోద్యమ స్వరూపంలో ప్రారంభమయింది. ''ఆంధ్ర పితామహ'' మాడపాటి హనుమంతరావుగారి అడుగుజాడల్లో ఈ గ్రంథాలయోద్యమమునకు బీజా వాపన జరిగింది. వరంగల్లులో కీ॥ శే॥ పాలపర్తి సత్యనారాయణరావుగారి ఇతోధికమైన కృషివలన 1904 సంవత్సరములో హనుమకొండనందు రాజరాజ నరేంధ్రానంద భాషానిలయం స్థాపించబడినది. యువకులలో చైతన్య స్ఫూర్తికి నాంది పలికింది.

1918 సంవత్సరములో వరంగల్లు, మట్టెవాడలో శబ్దానుశాసనాంధ్ర భాషా నిలయం స్థాపించడం జరిగినది. ఆ రోజులలో ఆంధ్రశబ్ద ఉపయోగమే ఒక సాహసోపేతమైన చర్యగా ఉండేది. ఈ భాషానిలయాలు జాతీయవాదుల సమావేశ స్థలాలుగా ఉపకరించినవి. ఆ రోజులలో మాదిరాజు రామకోటేశ్వరరావు, పర్చా రంగారావు, జమలాపురం గోపాలరావు, తూము వరదరాజులు, కాళోజీ రామేశ్వరరావు, ఏటూరి వెంకటేశ్వరరావుగారలు, ఆ నాటి యువకులు కాళోజీ నారాయణరావు, ఆనందరావు దేశ్‌ముఖ్, కె. వి. రామారావు, కె. వి. భూపాలరావు మొదలగువారు జాతీయోద్యమంతోపాటు, గ్రంథాలయోద్యమానికి, గజాననోత్సవాలకు తీవ్రమైన కృషి చేసారు.

1922 లో ఇనుగుర్తిలో ''తెనుగు పత్రిక'' స్థాపన కూడా పరోక్షంగా (ఒద్దిరాజు సోదరులు) ఈ ఉద్యమానికి మరింత చేయూత నిచ్చింది. 1922లో

మడికొండలో 'ప్రతాపరుద్ర భాషానిలయం' స్థాపన జరిగింది. ఈ గ్రంథాలయ నిర్వహణకొరకు నాటకాలు వేసి, చందాలు ప్రోగుచేసి నడిపామని శ్రీ కాళోజీ రామేశ్వరరావుగారు తమ జ్ఞాపకాలను పునరావృతం చేసుకుంటూ చెప్పారు. జాతీయత, గ్రంథాలయోద్యమం నేపథ్యంలో 1930 సంవత్సరములో వరంగల్లునందు ఆర్యసమాజ స్థాపన జరిగింది. 1935 సంవత్సరములో రాజరాజనరేంద్రాంధ్ర భాషానిలయం రజతోత్సవములను జరుపుకున్నది. దాదాపుగా ఈ సమయంలోనే ఇనుగుర్తినందు ''వివేకానంద గ్రంథాలయం'' స్థాపించబడినది.

1941 సంవత్సరములో (బమ్మెర) గూడూరులో జాతీయోద్యమం, ఆర్య సమాజ, స్టేట్ కాంగ్రెస్‌ల ప్రేరణతో శ్రీ చౌడవరపు విశ్వనాధంగారు పూనుకుని 'భారతీ పఠనాలయం' గ్రంథాలయమును స్థాపించినారు. గ్రంథాలయోద్యమం కలిగించిన ప్రేరణతో సాహితీ ప్రియులు ఏర్పరచుకొనిన ''కాకతీయ సమితి'' అను సంస్థ వరంగల్లులో 1942 లో రూపకల్పన చేసుకొనబడినది. ''శబ్దానుశాసనాంధ్ర భాషానిలయం'' 1945 సంవత్సరములో రజతోత్సవాలను ఘనంగా జరుపుకున్నది. 1947 సంవత్సరములో ఘనపురం స్టేషనులో ''సీతారామ గ్రంథాలయం'' స్థాపించినారు. దాదాపు అదే సమయంలో పల్లగుట్టనందు ''తెలుగుతల్లి గ్రంథాలయం'', పెద్ద పెండ్యాలలో ''తెలంగాణా గ్రంథమాల'', వేలేరులో ''నేతాజీ గ్రంథమాల'', ఖిలా షాపురంలో ''జైహింద్ గ్రంథాలయం'', జనగామలో డా॥ నర్సింహ్మారావు గారి ఆధ్వర్యంలో ''యువజన గ్రంథాలయం'', వరంగల్లు కోటలో ''ప్రతాప రుద్రాంధ్ర గ్రంథాలయం''లను స్థాపించుకోవడం జరిగినది.

1955 సంవత్సరములో హైదరాబాదు పౌర గ్రంథాలయాల చట్టము 1955 ద్వారా వరంగల్లు జిల్లాలో స్థానిక గ్రంథాలయ సంస్థ, వరంగల్లు హన్మకొండ కేంద్రంగా డిసెంబరు 1955లో ఏర్పాటు చేయడం జరిగింది. ఈ చట్టము ద్వారా 9 మంది సభ్యులు ఈ గ్రంథాలయంలో ఉండేవారు, 1958-59లలో పర్కాల, నర్సంపేట, రాయపర్తి గ్రామములలో శాఖా గ్రంథాలయాలు

ఏర్పాటు చేయడం జరిగినది. 1960 సంవత్సరములో వైశ్య ప్రముఖులు కొందరు కలిసి వైశ్య భవనమునందు శ్రీ వాసవీ గ్రంథాలయం స్థాపించి నేటికిని దిగ్విజయంగా నడుపబడుచున్నది.

క్రమాను క్రమంగా ప్రభుత్వములో వస్తున్న మార్పుల ననుసరించి "ఆంధ్ర ప్రదేశ్ పౌరగ్రంథాలయాల చట్టం 1960" ను పురస్కరించుకొని 18 మంది సభ్యులతో స్థానిక గ్రంథాలయ సంస్థలను పునర్వ్యవస్థీకరించడం జరిగినది. ఆ 18 మంది సభ్యులు వీరు–

1. శ్రీమతి కనకరత్నమ్మ
2. శ్రీ మాటూరి నరసింహారావు
3. శ్రీ ఇరుకుల్ల రాజయ్య
4. శ్రీ సామల ఉప్పలయ్య
5. శ్రీ వెంకటరామ నర్సయ్య
6. శ్రీ ముదిగొండ ఎల్లమందయ్య
7. శ్రీ యన్. యతిరాజరావు
8. శ్రీ కె. గోపాలరావు
9. శ్రీ అడవాల సత్యనారాయణ
10. శ్రీ కాళోజీ రామేశ్వరరావు
11. శ్రీ చాడ వాసుదేవరెడ్డి
12. శ్రీ కేస గుర్నాధం
13. శ్రీ దేవులపల్లి దామోదరరావు
14. శ్రీ ఇ. జనార్దన్ రెడ్డి
15. శ్రీ కె. నర్సింహారెడ్డి
16. శ్రీ పి. సంజీవరెడ్డి
17. శ్రీ గంధి సత్యనారాయణ
18. శ్రీ మంచన సోమదేవ్

1961–62 సంవత్సరాలలో గ్రంథాలయ సంస్థ ఆధ్వర్యంలో ఈ క్రింది ప్రాంతాలలో బుక్ డిపాజిట్ సెంటర్స్ ఏర్పాటు చేయబడినవి. 1) కాజీపేట, 2) శాయంపేట, 3) దేశాయిపేట, 4) ఖిలా వరంగల్లు, 5) రంగశాయిపేట, 6) హసన్‌పర్తి, 7) ఉనికిచెర్ల, 8) వడ్డెపల్లి. 9) ఉర్సు, 10) రాజ్‌పూత్ వాడి. 1962 సంవత్సరములో గ్రంథాలయ సంస్థ మొట్టమొదటి అధ్యక్షుడిగా శ్రీ అడవాల సత్యనారాయణగారు ఎన్నుకొనబడి 1967 వరకు కొనసాగినారు. 1968 లో శ్రీ చాడ వాసుదేవరెడ్డిగారు అధ్యక్షుడిగా ఏకగ్రీవముగా ఎన్నుకొనబడి ప్రస్తుతం కూడా వారే కొనసాగుతున్నారు.

1963లో జనగామనందు శాఖాగ్రంథాలయంను ఏర్పాటు చేయడం జరిగినది. 1964 సం॥లో పౌర గ్రంథాలయ సంస్థ నిర్వహణలో ప్రభుత్వ ప్రాంతీయ గ్రంథాలయము సుబేదారిలో స్థాపించి, 1983 అక్టోబరులో రంగంపేటలోని సెంట్రల్ జైలు ఎదురుగా స్వంత భవనములోనికి మార్చబడినది. జిల్లా గ్రంథాలయ సంస్థ 1980 సం॥లో తమ స్వంత భవనములోనికి మార్చబడినది. బాల సముద్రములో పబ్లిక్ గార్డెన్ వెనుకవైపునకు స్థానిక గ్రంథాలయ సంస్థ, వరంగల్లు ఆధ్వర్యంలో 1964 లో మహబూబాబాదు, ములుగులలో గ్రంథాలయాలు స్థాపించబడినవి.

గ్రామీణ ప్రాంతాలలో స్థానికులచే - ఈ క్రింది ప్రాంతాలలో ఈ క్రింది గ్రంథాలయాలు స్థాపించబడినవి. విజ్ఞాన మందిర్ ఉర్సు, కరీమాబాదు; జగదీశ్వర గ్రంథాలయం, పర్లపల్లి, పరకాల; రవీంద్ర గ్రంథాలయం, శాయంపేట; శ్రీ చెన్నకేశవ గ్రంథాలయం, బచ్చన్నపేట; కోదండరామ గ్రంథాలయం, బచ్చన్నపేట, నవాబుపేట; S. R. M. గ్రంథాలయం, ధూళిమిట్ట; ఇందిరా గ్రంథాలయం, మరిముస్త్యాల; వాణీ గ్రంథాలయం, చింతలపల్లి; గ్రామ గ్రంథాలయం, పెద్దకోడెపాక; బాపూజీస్మారక గ్రంథాలయం, మొగుళ్ళపల్లి; వివేకానంద గ్రంథాలయం, కేసముద్రం; రవీంద్ర గ్రంథాలయం, ఇప్పగూడెం మొదలగు ప్రాంతాలలో ఈ గ్రంథాలయాలు ప్రభుత్వంచే గుర్తింపు పొందినవి.

జిల్లా గ్రంథాలయ సంస్థ ఆధ్వర్యంలో 1967లో హనుమకొండ, ఘన్‌పూర్ స్టేషన్, డోర్నకల్, చెల్పూరులలోను, 1970 లో చల్లగరిగెనందు శాఖా గ్రంథాలయములను స్థాపించినారు. 1969 సంవత్సరములో గూడూరు (బమ్మెర- పాలకుర్తి)లో మహాత్మాగాంధీ స్మారక గ్రంథాలయం శ్రీ ఆర్తి మురళీధరస్వామిగారు కార్యదర్శిగాను, 1972 సంవత్సరములో వేలేర్పులో శ్రీ నిరంజన్‌రావుగారి నేతృత్వములో నేతాజీ గ్రంథాలయములు ప్రారంభం అయి కొంతకాలం నడిచినవి. 1972 నందు ఇనుగుర్తిలో జిల్లా గ్రంథాలయ సంస్థవారు తమ శాఖను, 1973 లో శబ్దానుశాసన గ్రంథాలయమును

ప్రభుత్వ నిర్వహణలోకి తీసుకొని మొదటి శ్రేణి శాఖా గ్రంథాలయంగా మార్చడం జరిగినది. చేర్యాలలో 1975 లోను, 1979 లో హన్మకొండ పబ్లిక్ గార్డెన్‌నందు అంతర్జాతీయ బాలల సంవత్సరమును పురస్కరించుకొని బాలల గ్రంథాలయం, వర్ధన్నపేట, హసన్‌పర్తి, ఆత్మకూరులలో శాఖా గ్రంథాలయాలను ప్రారంభించినారు.

గ్రామీణ గ్రంథాలయాలకు ప్రాధాన్యత ఇచ్చి, ఆ ప్రాంతాలలో ఎవరైనా నడిపినచో, వారికి నెలకు రూ॥ **150**/- ల చొప్పున రోజుకు **4** గంటల చొప్పున (సాయంత్రం గం. 4-00 నుండి 7-00 గంటల వరకు) పనిచేసే విధముగా ఈ క్రింది ప్రాంతాలలో జిల్లా గ్రంథాలయ సంస్థ ద్వారా స్థాపించ బడినవి. 1979 లో ఆరెపల్లి, నెల్లుట్ల, 1980 లో వెల్దండ. 1981 లో తరిగొప్పుల, ఖిలాషాపూర్, కుందారం; 1982 లో కురవి, చిన్నకోడెపాక, బొమ్మెర, రాజోలు; 1983లో కరీమాబాదు; 1984 లో వనపర్తి, రామవరం, మడికొండ, కాజీపేట, కుమార్‌పల్లి; 1985లో రంగశాయిపేట, కడిపికొండ, పత్తిపల్లి గ్రామాలలో స్థాపించినారు. 1984 సంవత్సరములో స్థానికులు కొందరు కలిసి మడికొండలో కాకతీయ గ్రంథాలయమును స్థాపించుకొని నడుపుతున్నారు.

1986 లో పంచాయితీ, రెవెన్యూ వ్యవస్థను పునర్ వ్యవస్థీకరించినప్పుడు వరంగల్లు జిల్లాను, **50** మండలాలుగా విభజించడంవలన, ప్రభుత్వమువారి ప్రణాళికలో ఒక భాగంగా ప్రతి మండలంలో ఒక గ్రంథాలయంను ఏర్పర చినారు. మరిపెడ, నెక్కొండలలో గ్రంథాలయాలను స్థాపించవలసి ఉన్నది. అయితే గూడూరు మండలంలో ఖానాపూర్ గ్రామంలో గ్రంథా లయం ప్రారంభించినప్పటికి అది పనిచేయడం లేదు. ముఖ్యంగా నిధుల కొరతే దీనికి కారణంగా కనిపించుతున్నది. 1986 సంవత్సరములో సుబేదారి ఎక్సైజు కాలనీలో స్థానిక ప్రజలు చందాలు వేసుకొని ఆదర్శ గ్రంథా లయమును నొకదానిని ప్రారంభించి నడుపుకుంటున్నారు. ప్రత్యేకమైన

ప్రక్రియకు, సిద్ధాంతమునకు కట్టుబడి 1979-80 ప్రాంతాలలో వరంగల్లు నందు శ్రీ నోముల జ్వాలా నరసింహారావు ఆధ్యాత్మిక గ్రంథాలయం స్థాపించి దిగ్విజయంగా నడుపుతున్నారు. ఇందులోను 60 ఆధ్యాత్మిక పత్రికలు, 50 వేల విలువ కలిగిన ఆధ్యాత్మిక గ్రంథాలు లభ్యం అవుతున్నవి.

1987 సంవవత్సరములో గ్రంథాలయాలను స్థానిక సంస్థలనుండి మినహాయించి ప్రభుత్వ పరంగా తీసుకొనినది. ప్రస్తుతం వరంగల్లు జిల్లాలో ప్రభుత్వ నిర్వహణలో **54** గ్రంథాలయాలు, ప్రైవేటు నిర్వహణలో **14** గ్రంథాలయాలున్నవి బుక్ డిపాజిట్ సెంటర్స్‌కాకుండా. వరంగల్లు జిల్లా సంస్థ కార్యనిర్వహణ అధికారిగా శ్రీ అనిశెట్టి ఆనందముగారు ఉన్నారు.

